శ్రీ

# వేదము వేంకటరాయశాస్త్రి సంస్మృతి

**(Reminiscences of Vedam Venkataraya Sastry Garu.)**

గ్రంథకర్త:

**గుఱ్ఱం వేంకటసుబ్బరామయ్య, యం. ఏ.,**

నెల్లూరు వేంకటగిరిరాజకళాశాలలో ఆంగ్లాధ్యాపకుఁడు,

'ఆంధ్రమేఘసందేశ' 'కవిత్రయకవితావిమర్శ'

'ఆంధ్ర రమణగీతా' రచయిత.



[వెల రు. 0-12-0.

# అంకితము.

క. శీర్షమణి వేదమునకుఁ
హార్షమ్మున కెల్ల నెల్ల యాత్మజ్ఞానో
త్కర్షము భగవాన్ రమణ మ
హర్షి పదమ్మునకుఁ గృతి సమర్పణసేతున్.

తే. సకల సత్కావ్య రసపూరసారిణి తతి
జ్ఞాన సాగరులోఁ జేరి లీన మౌను;
గానఁ గావ్యగురుస్మృతి యైన కృతిని
దగదె జ్ఞానగురున కంకితమ్మొనర్ప?

క. వేంకటరాయలు శాస్త్రులు
వేంకటరాములు మహర్షి; వీ రిరువురు ని
శ్శంకమ్ముగ వేంకటరమ
ణాంకిత సద్వస్తు వేక మాత్మయ గారే?

తే. గురుని సంస్మృతి యాత్మసంస్మరణమె గద;
గురు సమర్పణ యాత్మనుగూర్చియె గద;
గురుని శుశ్రూష లఘుభావ మరుగుకొఱకె,
గురుతరంబగు పరమాత్మఁ బొరయుకొఱకె.

క. గురువే బ్రహ్మయు, విష్ణువు,
గురుదేవుఁడె యీశ్వరుండు, గురువే సాక్షాత్
పరమా బ్రహ్మము; గావున
గురుచరణాంభోజములను గోరి భజింతున్.

# విన్నపము.



1936-లో "స్వతంత్ర" యను స్థానిక పత్రికయందుఁ బ్రకటితములైన పండ్రెండువ్యాసములు మదీయములు కొన్ని మార్పులతో ఈగ్రంథమందు పునర్ముద్రితములైనవి. "లేఖలు" అను శీర్షికగల ప్రకరణము ఇప్పుడు క్రొత్తగాఁ జేర్పబడినది.

ఈ చిన్నికృతిని భగవాన్ శ్రీరమణమహర్షి దివ్యపాద పద్మముల కంకితము చేయఁగోరి ప్రార్థింపఁగా, అందులకుఁ బరమాదరముతో నంగీకరించిన శ్రీరమణాశ్రమ సర్వాధికారులు శ్రీనిరంజనానంద స్వాములవారికి గాఢ కృతజ్ఞతా పూర్వకవందనముల నర్పించువాఁడను.

నెల్లూరు.<br>
2-11-1938.

రచయిత

# శాస్త్రిగారి జీవితసంగ్రహలేశము.



కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారు రాజమహేంద్రవర రాజకీయ కళాశాలలో సంస్కృతపండితులుగ నుండిన శ్రీ వేంకటరమణశాస్త్రులవారికి లక్ష్మమ్మగారికి తే 21-12-1853 దిన జన్మించిరి; 1869 లో మెట్రిక్యులేషన్ మొదటి తరగతిలో జయమొందిరి; 1875 లో యఫ్. ఏ, పరీక్షయైరి; అచ్చటచ్చట ఉపాధ్యాయులుగాఁ బనిచేయుచు 1886 లో మదరాసు క్రిస్టియన్ కాలేజి సంస్కృతపండిత పదవిని బడసి, 25 సంవత్సరములు అతిశ్లాఘ్యముగ నిర్వహించిరి; 1887 లో సంస్కృతాంగ్లములందు బి. యె. పరీక్షకుఁ గట్టి సంస్కృత జేతలలోఁ బ్రథములుగా రెంటను ఉత్తీర్ణులైరి; 1916 లో సూర్యరాయాంధ్ర నిఘంటువునకుఁ బ్రధాన సంపాదకులుగ నియమింపఁబడి కొంతకాలము పనిచేసిరి; 1920 లో ఆంధ్రమహాసభ వారిచే "మహోపాధ్యాయ" బిరుదముతో 1116 రూపాయలతోడ సమ్మానింపఁబడిరి; 1922 లో శ్రీ ద్వారకాపీఠ శంకరభగవత్పాదులచే "సర్వతంత్రస్వతంత్ర" "మహామహోపాధ్యాయ" "విద్యాదానవ్రతమహోదధి" అను బిరుదములతో సత్కరింపఁబడిరి; 1927 లో ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారిచే "కళాప్రపూర్ణ" అను నూతన బిరుదముతో

సన్మానింపఁబడిరి; 1923 లో ఋణభారవిముక్తులైరి; 1929 జూన్ 15-వ తేది పరమపదించిరి.

శాస్త్రులవారి గ్రంథములలో ముఖ్యమైనవి: స్వతంత్ర నాటకములు-"ప్రతాపరుద్రీయము" (1897), "ఉష" (1901), "బొబ్బిలియుద్ధము" (1916); అనువాదములు—"నాగానందము" (1891), "శాకుంతలము" (1896), "ప్రియదర్శిక" (1910), "మాళవిక" (1919), "ఉత్తరరామచరిత్ర" (1920), "రత్నావళి" (1921), "విక్రమోర్వశీయము" (1921); వ్యాఖ్యలు—"మేఘసందేశవ్యాఖ్య" (1901), "శృంగారనైషధ సర్వంకషవ్యాఖ్య" (1913), "ఆముక్తమాల్యదా సంజీవనీ వ్యాఖ్య" (1921); ఇతరములు—"స్త్రీపునర్వివాహదుర్వాద నిర్వాపణము" (1873), "అలంకారసారసంగ్రహము" (1882), "ఆంధ్రప్రసన్నరాఘవ విమర్శనము" (1898), "గ్రామ్యభాషా ప్రయోగనిబంధనము" (1899), "విసంధివివేకము" (1912), "తిక్కనసోమయాజి విజయము" (1919), "విమర్శవినోదము" (1920); నిర్వాణానంతర ప్రకటితములు—"ఆంధ్రహితోపదేశ చంపువు" 1932), "ఆంధ్రసాహిత్యదర్పణము" (1937).

# గురుస్మరణం.



సీ. వ్యాక్రియాసాహితీవార్ధిఁ గుంభజులీల
నాపోశనముఁగొన్న యరిదిమేధ,
నైషధాముక్తాది నవపయోంబుధిఁ ద్రచ్చి
యమృతమ్ముఁ బంచె మహామనీష,
ప్రతిపక్షకోటి హోరాహోరి నొంటిమై
సాధించి యోర్చిన సాహసంబు,
ఏకపుత్త్రుఁ డకాలమృతివాతఁ బడిన య
త్తఱిని బాఠముసెప్పు ధైర్యమహిమ,

తే. ఛాత్రకోటి ప్రచారంబు సాఁగ నాట
కములు వ్రాసి యాడించిన కార్యదీక్ష,
యొక్కెడలఁ దోఁచె నీయందె యక్కజముగ !
ప్రథితగురురాయ, వేంకటరాయశాస్త్రి.

# విషయానుక్రమణిక.

# పీఠిక.



ప్రహ్లాద న్యాయముననేని ఘుటాకర్ణ న్యాయముననేని పలువురు తమచూడ్కిని కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రిగారి పై సారించుచున్న యీసమయము శాస్త్రులవారి సంభాషణచేష్టితాదులలో విశేషములను నాసమక్షమున జరిగినవానిని జ్ఞాపకమున్నంతవఱకు గ్రంథస్థముగావించుటకు అనువైన యదనుగ భావించి యీవ్యాసావళి వ్రాయ నుపక్రమించినాఁడను ఇట నాయుద్దేశ్యము శాస్త్రులవారిని భూషించుటగాదు, దూషించుటయుఁ గాదు. చదువరులకు వినోదము నేని వివేకము నేని గూర్పఁజాలి శాశ్వతమగు విలువగలిగినయుదంతముల నాయెఱుకకొలఁది యథాతథముగ లిఖించుటయే మదీయసంకల్పము. ఈవ్యాసములలో నెచ్చటను ఏవ్యక్తులకును మనస్సు నొప్పకుండునట్లు జాగరూకత వహింతును.

# వేంకటరాయశాస్త్రిసంస్మృతి.

## I

### ప రి చ య ము.

శాస్త్రులవారి ప్రథమదర్శనము నాకు పాడాపు పాతిక శతాబ్దిక్రిందట అప్పుడుండిన ముత్తరాజు సుబ్బరామయ్య బడిలో ఒక సమావేశమున వారు అధ్యక్షపీఠ మలంకరించి నపుడు. అట (అప్పుడు మాయుపాధ్యాయులు - ఇప్పుడు సహోధ్యాపకులు) శ్రీ నేలటూరు రామదాసయ్యంగారు "తెలుఁగుం జుట్టిన తెగులు" అను వ్యాసమును జదివిరి. ఒక బాలుఁడు "Nose and Eyes" (ముక్కు, కన్నులు) అను నాంగ్లపద్య మును సులోచనముల గుఱించి నాసికా నేత్రములవివాదము నాసిక జయము అను నితివృత్తముగల దానిని పఠించెను. శాస్త్రులవారు తమ యుపసంహార భాషణమందు "మన తెలుఁగులో 'ముక్కుద్దము' అను ప్రయోగము పూర్వోక్త పద్య భావమునే తలఁపించుచున్నది." అని వచించిరి.

శాస్త్రులవారితో ప్రథమ సంభాషణము ఈయూరి రైలుస్టేషనులో "ఉత్తరరామచరితనాటకము" తొలియాట జరిగిన మఱునాడు. అయ్యెడ వారు నన్నుఁ బలుకరించి ఆ యాటనుగూర్చి యొకింత ముచ్చటించిరి. "ఉండవలసినంత

బాగుగ నుండలేదుగాఁబోలు నిన్నటి ప్రదర్శనము" అని నేనంటిని. వారు "తొలిపదమును ('ఉండవలసినంత') దొలఁగింపవచ్చును" అని వాక్రుచ్చిరి. అంతట నేను "ఈనాటకము ప్రదర్శన యోగ్యమేనా?" అని యడిగితిని "ఆడుటకు దీనితో ఈడగు నాటకము లేదు. సంస్కృతమున నిది అత్యంత జయప్రదముగాఁ బ్రయుక్తమగుటను కనులారఁజూచి యున్నాను. తత్ప్రతిధ్వనులింకను నాచెవులలో అనురణించు చున్నవి." అని వారు సెలవిచ్చిరి. ప్రసంగవశమున నేను "'ఉష' లోని

'అక్షయకౌతుకంబు వొలయంగ, నశోకలతావధూటి యీ
దక్షిణగంధవాహు బలితంపుఁగవుంగిటఁగ్రుచ్చి, వే సమ
స్తక్షితిజాతలోలతలతావుల కల్గి, మరందవారి పు
ష్పాక్షులఁజిప్పిలన్ గిసలయాధర మీయక త్రిప్పఁ,జూడరే'

అను పద్యము 'వసుచరిత్ర' వసంతవర్ణనలోని

'ఒనర హిమాపకుంతనము
లూడ్చి, తెమల్చిన పత్త్రభంగముల్
సన, నసియాడుచున్ మొగడ
చన్నులు పల్లవపాణిఁగప్పు నూ
తనలతికాలతాంగుల ను
దారగతిం జలివాపి, నెయ్యపుం
బెనఁకువ నేర్పు దక్షిణస
మీరణుఁ డొయ్యనఁ దావు లంటుచున్.'

అనుపద్యమును నాస్మరణకుఁ దెచ్చినది." అని యంటిని. ఇందులకు వారు మందస్మిత సుందరవదనులై నిజామోదము సూచించుచు "ఇట్టి సామ్యములు వాఙ్మయమున వేనవేలు గాన వచ్చును" అని నుడివిరి. అంతట "పై పద్యమును కవి ఆశు వుగాఁ బలికియుండునా? వ్రాసి సరిదిద్దియుండునా?" అని ప్రశ్నించితిని. "భావస్ఫురణము ఆశువుగావచ్చును. భాష యో ఒకపరిగాదు పలుమాఱు దిద్దిదిద్ది తీర్చినది అనుటకు సందియము లేదు" అని యుత్తరమిచ్చిరి.

శాస్త్రులవారికి చెన్నపురమున ఆంధ్రసారస్వత మహా సభవారు "మహోపాధ్యాయ" బిరుదమును ౧౧౧౬రూప్యము లతోఁగూడ నొసంగి సత్కరించిన క్రొత్తలో నెల్లూరు మండలీ యులపక్షమున నొక సమ్మానసభ జరుపఁబడెను. అప్పటిసమ్మాన పత్త్రము మిత్త్రుల యానతి చొప్పున నాచే రచింపఁబడెను. అదియే నాకు శాస్త్రులవారితోఁ బరిచయముఁ బెంపొందించు నవకాశ మాయెను. ఆసభ పచ్చయప్ప కళాశాలావరణములో జరిగెను. నెల్లూరి పిన్నపెద్దలతో మందిరము క్రిక్కిఱిసి పోయెను. కీర్తిశేషులు శ్రీవావిలికొలను సుబ్బరావు పంతులుగారు అధ్య క్షతవహించిరి. కీర్తిశేషులు ప్రొఫెసరు పి. సుబ్రహ్మణ్యయ్య గారు సమ్మానపత్త్రమును అపరిమితాదరోత్సాహములతోఁ బఠించిరి. అధ్యక్షులు శాస్త్రులవారి నభినందించుచు గ్రామ్య వాద విప్లవము నెదుర్కొనుటయందు తాము శాస్త్రుల

వారును జోడుజోడులై సలిపిన సమరమును వర్ణించిరి. దీనినే తడవుచు శాస్త్రులవారు ఇట్లుపన్యసించిరి.

“సంస్కృతము మనకు అమ్మమ్మ, అవ్వ. తెలుఁగు మన తల్లి. గ్రామ్యపుఁదెలుఁగుగూడ మన తల్లియే, కాని బహిష్ఠయైనతల్లి. ఆమాత్రమున మనకామెయెడఁ బ్రేమతగ్గదు. ఐనను అవస్థావిశేషమునం జేసి తల్లి నెట్లో గ్రామ్యభాషను అట్లే యొకింత దూరముగా నుంపవలసివచ్చును. ఇది నాయాశయము గావున గ్రామ్యభాషయనిన నాకు ద్వేషమని గ్రామ్యవాదులు భ్రమింపకుందురుగాక” అని.

---

II

## విద్యార్థి జీవితము.

అప్పుడు కళాశాలా విద్యార్థులమగు మేము నేర్చుకోఁదగిన గుణపాఠములు మెండుగానుండునని శాస్త్రిగారిని వారి విద్యార్థి జీవితమునుగూర్చి పలుమారు అడుగుచుంటిని అందులకు వారాయాసందర్భముల నొసంగిన ప్రత్యుత్తరముల సారమును జ్ఞాపకమున్నంతవఱకు వారిభాషితముగానే యిట సంగ్రహించువాఁడను.

"మా పుదూరుద్రావిడసంఘము పాండితికిఁ బేరుఁగన్నది. నాచిన్నతనమున పుదూరులో శైశులు పంచకావ్యాదులనే గాక సంస్కృతమున ప్రౌఢనాటకమైన 'యనర్ఘరాఘవము'ను తెలుఁగున పౌఢప్రబంధమైన 'యాముక్తమాల్యద'ను సామాన్యముగఁ బఠించుచుండిరి. పై రెండు కృతులను ముఖస్థము గావించికొనిన పండిత ప్రకాండులు పలువురుండిరి. తత్సంఘీయులైన మాతండ్రిగారు వేంకటరమణశాస్త్రులవారు విద్వత్సార్వభౌములగుటలో వింతలేదు. వారు పండితమాత్రులుగారు ఋషికల్పులు; ఎవరేసందియ మడిగినను తడవికొనక వాయిదావేయక గ్రంథసాహాయ్య మపేక్షింపక తత్క్షణము సప్రమాణము సిద్ధాంతరూపము అగు నుత్తరము నొసంగుచుండువారు; నిరాడంబర జీవులు; పేదయగు పెద్ద కుటుంబమును బోషింపవలసియు, ఆత్మగౌరవము నత్యంతము

పాటించువారు; కుశాగ్రబుద్ధులయ్యు వివాదములకు విముఖులు. చమత్క్రియా ప్రియులయ్యు మితభాషణులు. ప్రేమపరిపూర్ణులయ్యు, వైరాగ్యసంపన్నులు. ఏవిషయమునను తన కొమరుల విద్యాసరణియందుఁగూడను అనవసరముగ జోక్యముకలిగించుకొని ఆందోళనపడువారు కారు.

కావుననే అట్టి పండితశ్రేష్ఠునకు జన్మించియు నాకు బాల్యమున సంస్కృత విద్యాభ్యాసము లభింపలేదు. ఎందరో విద్యార్థుల బృందము నిత్యము మాయింట మాతండ్రిగారి యొద్దఁ బాఠము చెప్పుకొనుచుండియు నేను వారితోఁగలసి సంస్కృత మభ్యసింపలేదు. అందులకు మాతండ్రిగారు నన్ను బలవంతపఱుపనులేదు. ఆదినములలో నాకు ఆంగ్లముపై నభిమాన మధికము. రాజభాషయగుటచేఁగాక యందలి వాఙ్మయ సౌందర్యముచేతను ఆంగ్లము నామానసమును జూఱగొనినది. అతిబాల్యముననే ఆంగ్లకృతులఁ బెక్కింటిని బఠించితిని. షేక్స్పియరును షెల్లీయును నాయభిమానకవులు. "ఆంటొనీ క్లియొపాత్రా" అను నాటకము నాకెంతయుం బ్రీతిపాత్రము.

అంతట కొందరు సహవాసుల ప్రోత్సాహమున "మనుచరిత్రముఁ" జదువఁదొడంగితిని. తత్పఠనానంద పారవశ్యముచేఁ బ్రతిపద్యమును మఱిమఱి చదివి స్వల్పకాలములో గ్రంథమెల్లఁ గంఠపాఠ మొనర్చితిని. మనుచరిత్రయే తొలుత నాకాంధ్రసారస్వతముపై మరులు గొలిపినది. వెంటనే పెద్ది

యొత్తినవానివలె లభ్యమునైన యితర ప్రబంధములను ఆంధ్ర భారత భాగవతాది మహాకావ్యములను ఒక్కమోపునఁ బఠించితిని. భారతపఠనముచే నాహృదయమున భక్తివిస్మయానందములు ముప్పిరిగొనెను. ఉత్తమకవితా స్వరూపము ప్రత్యక్షమయ్యెను. కవిత్రయమువారు కవిమాత్రులుగారు మహాపురుషులు అని స్పష్టముగ బోధపడెను. షేక్సుపియరు కవిత్వముతోఁ దులఁదూగు రచన మన తెలుఁగునను గలదు గదా యని చిత్తము పొంగెను.

ఆయాకబ్బములఁ జదువునప్పుడు అట్లు మనమును కవనమల్లవలయును అనుకాంక్ష యంకురించెను. పద్యము వ్రాయఁదొడఁగినంతనే మూఁడు ప్రతిబంధకము లెదురయ్యెను. అవియేవన ఛందస్సురామి, వ్యాకరణము తెలియమి, గీర్వాణ పాండితిలేమి. ఛందోవ్యాకరణము లెఱుఁగకున్నఁ గావ్య ప్రపంచమునందు సకలమును సంశయమయమే యనియు సంస్కృతము రాని యాంధ్రభాషావైదుష్యము పునాదిలేని సౌధమువంటిదనియు లెస్సగా గ్రహించితిని. సంస్కృత వాఙ్మయమును వ్యాకరణ ఛందోలంకార శాస్త్రములను జక్కగాఁ జదివి స్వాధీనపఱుచుకోవలెనని ప్రతినఁ బూనితిని. అది మొదలు నిద్రాహారములనైతము సరకుగొనక ముఖ్య గృహకృత్యము లొనర్చునపుడుఁదక్క తక్కిన యకాలమెల్ల గీర్వాణవాణిని సేవించుచుఁ దత్కావ్యశాస్త్ర పఠనమననముల నిమగ్నుఁడనై యుంటిని. అది యొక యోగాభ్యాసమే యన

వచ్చును. చాలవేఁకువ బ్రొద్దునఁనే లేచి యొక వ్యాకరణ సూత్రమును భాష్యముతో బఠింతును. అంతట దానియందే దృష్టినెల్ల నిలిపి మనసులో వల్లించుకొనుచు ఉదయ భోజన మగుసరికి దానింబూర్తిగ హృదయస్థము గావించుకొందును. ఆవెనుక ఛందస్సులో నొకభాగము పఠించుట, తన్మననము. ఆమీఁద నట్లే అలంకారశాస్త్రములో నొక ఖండము చదువుట, తదవలోడనము జరగును; సాయంకాలమున సంస్కృత కావ్య పఠనము సలిపి రేయిఁబ్రొద్దువోయి నిదుర పైకొనువఱకుఁ జదివిన ఘట్టమునె ప్రతిపదము మరల మరల సంస్మరించి తత్సారస్యమెల్ల హృదయమున కెక్కించికొని యానంద రసాంబుధి నోలలాడుచుందును. ఆటలు మానివేసితిని. సవయ స్కుల సహవాస ముజ్జగించితిని. ఎటువోవుచుంటినో ఏమిఁ నేయుచుంటినో యేమితినుచుంటినో యెఱుగను. ధ్యానమెల్ల గ్రంథపఠనమందే; విజ్ఞాన సమార్జనమందే; 'యోగికిమాకు నిఁకేమి భేదమో!'

ఇటు పరిశ్రమించి యఫ్. ఎ. చదువు నాటికి ఆంగ్లాంధ్ర గీర్వాణకావ్యశాస్త్రాదులందు వ్యుత్పన్నుఁడనైతిని. పాశ్చాత్య ప్రవచన పద్ధతియు తద్విమర్శన విధానమును అత్యల్పకాల ములో క్లిష్టవిషయము నైత మెఱుంగుటకును మంచిదృక్పథ మేర్పడుటకును మిక్కిలి యుపకరించినవి. దానంజేసి యఫ్. ఏ., బి. యే. చదువులు అవలీల నయ్యెను. ఏపాఠ్యగ్రంథము విప్పినను సుపరిచితమవోలె సులువుగ మనస్సున కెక్క

చుండెను. పాశ్చాత్యకవికృతుల పట్టికలు మున్నుగు నల్లింపనలయు నంశములను సంస్కృత శ్లోకములుగా నొనర్చి కంఠస్థము గావించికొంటిని. [ఇట శాస్త్రులవారు షేక్స్పియరు నాటక నామములను వరుసవీడక యిమిడ్చి తాను రచించుకొనిన శ్లోకావళి వినిపించిరి.]

ఆద్యంతము నావిద్యాభ్యాసము స్వయంకృషియే మా తండ్రిగారివలన నాకు లభించినది శ్రుతపాండిత్యమే చిన్న నాటనే వారిని శుశ్రూషించి విద్య నేర్వనందులకు నేనిపుడు చింతింపవలయునో స్వశక్తిపై నాధారపడి చదువు సాధించి నందులకు సంతసింపవలయునో నే నెఱుఁగను కాని యిది మాత్రము నాకుఁదోఁచును. ప్రతిభగలవానికి తదితర సహాయముకన్నఁ దనబుద్ధికి సూటియగు దారినే తాను నడచుట శ్రేయము. ఆత్మావలంబనమే పురోవృద్ధికి మేలిసాధనము.

అల్పకాలములో నధిక పాండితి నార్జింపఁగలుగు రహస్యమునకుం గీలకము అవధారణతోఁడి యవలోకనమే; నిరంతర మననమే; తదేకధ్యానమే. గట్టిపట్టుదలగలదేని యెట్టిదురవగాహ కావ్యమునేని యెట్టిదుర్ఘట కార్యమునేని సాధింపఁగలుగుదుము. ఎంతచిక్కుగల విషయమునేని చక్కఁగఁ దఱచి విశాలదృక్పథముతో అంగాంగితారతమ్య విచక్షణతో విమర్శింపఁగల సామర్థ్యము చాలవఱకుఁ బాశ్చాత్య విద్యా విధాన పరిచయమువలన నలవడినదే.

నేను యావజ్జన్మము విద్యార్థినే. ఎంతచదివియు ఎఱుకపడినది యల్పమేయని భావింతును నేర్చుకొలఁది ఇంకను నేర్వవలయునను కోర్కె పెరుగుచునేయున్నది. సాహితియే మదీయ జీవితసారము. సరస్వతియే నా యిష్టదేవత. తద్వారి వస్యయే నాజన్మసాఫల్యము."

# III

## ఉపన్యాసములు.

మదరాసునందును నెల్లూరను శాస్త్రులవారి యుపన్యాసములం బెక్కింటిని వినుభాగ్యము నాకు లభించినది అవి చాల వరకు ముద్రితములయ్యె, ఇప్పటివఱకు గ్రంథస్థముగాని యంశములఁ గొన్నింటిని నాయెఱుకకొలఁది నిటఁ బ్రకటింతును.

తొలుత శాస్త్రులవారి యుపన్యాసవైఖరినిగూర్చి యొక మాట. ప్రతి యుపన్యాసమునకుఁ బూర్వము తద్విషయ సంగ్రహము నొకజ్ఞాపికగా వ్రాసికొనుటయు దానిసాయమున యుపన్యసించుటయు వారియలవాటు. అట్టి జ్ఞాపికలే తదనంతర ప్రకటితములైనవి. కాని యవి ప్రణాళికలుమాత్రమే. ఉపన్యాసమో యెప్పటికప్పుడు స్ఫురించు నుదాహరణములు, వింతలు, వినోదములతో నిండియుండును. వారి యుపన్యాసములన్నిటను విశేషములు రెండు, మెచ్చఁదగినవి, శైలిసౌలభ్యము, చమత్కారగర్భితహాస్యము. విషయమెంత క్లిష్టము, గహనమైనను వారి వాక్కున తద్వివరణము అఱచేతఁ బండొలిచిపెట్టినట్లుండును. వస్తువెంత యుద్వేగకరమైనను కాదా ఆలోచనీయమైనను, వారిహాస్యరసంపు మేళనముచే ఆకర్షణీయమై, ఆపాతమధురమై, శ్రోతలచిత్తమును వశపఱుచుకొనును. మఱియొకవిశేషము—హాస్యకళావిశారదుల యుప

లక్షణము—హాస్యోక్తులకు సభ్యులెంత కడుపుబ్బునట్లు పడిపడి నవ్వుచున్నను, వారినడుమ శాస్త్రులవారు తాము మాత్రము నిశ్చలులై నిర్వికల్పులై నిలుతురు. ఎంతనవ్వు పుట్టించు విషయము నేని ప్రిదులని గాంభీర్యముతో నుడువుట శాస్త్రులవారి భాషణవిశేషము. దీనికి మంచియుదాహరణము ఈ యూరనే వారు "వ్యాకరణము"ను గూర్చి ప్రభుత్వమువారి బోధనాభ్యసనపాఠశాలలో నొసంగిన యుపన్యాసము. వ్యాకరణము వట్టి యెండుకట్టెగదా. అట్లయ్యు వారి యుపన్యాసము 'నవల' పఠనమువలె వినోదావహమై రసవంతమై రుచించెననుటకు నాటిశ్రోతలే సాక్షి.

మదరాసులో నొక సమావేశమున శ్రీ ప్రభల లక్ష్మీనరసింహముపంతులుగారు ఉపన్యాసకులు. విషయము "ఆంధ్ర వాఙ్మయచరిత్రపరంపర". అధ్యక్షులు శాస్త్రులవారు. గ్రుక్క త్రిప్పుకొనక చక్కనిభాషను ప్రౌఢసమాసముల గుప్పించు పంతులవారి యుపన్యాసధోరణి సభాసదులకానందవిస్మయముల వెల్లిగొలిపెను. ఉపన్యాసాంతమున శాస్త్రులవారు లేచి యిట్లు పలికిరి:

"కురిపించిరిగదా పంతులవారు సువర్ణ కుంభవర్షధార. ఆ జల్లులకు డిల్లవోయి యొక మదురుమాటు నాశ్రయించితిని. జడివెలిసిన వెనుక నిప్పుడు నేను మీకు జూపఁగలిగినవి ఆ మదురుచూరునుండి దిగజారు నీటిబొట్లే" అని.

మఱియొక సమావేశమున శాస్త్రులవారు ఔచితిని జర్చించుచు "పారిజాతాపహరణము"లోని

"జలజాతాసనవాసవాదిసురపూ
  జాభాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిర మ
  చ్చో వామపాదంబునన్
దొలగంద్రోసె లతాంగి; యట్లయగు; నా
  థుల్ నేరముల్ సేయఁజే
రలుకం జెందినయట్టి కాంత లుచిత
  వ్యాపారముల్ నేర్తురే?"

అనుపద్యము నుదాహరించి యిట్లు నుడివిరి.

"ఈపద్యములో 'తొలగంద్రోసె' అను మాటకు అక్షరలక్ష గాదు, అక్షరకోటియిచ్చినను చాలునా? ఇదానీం తన రసజ్ఞులన్ననో ఈ పదమునకు బదులు 'తన్నెను' 'పడఁదన్నెను' ఇత్యాదివ్రాసి 'మజా' యెక్కించితి మనుకొందురు గదా! ఔరా, ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకు!" అని.

మఱియు నొక యుపన్యాసమున శాస్త్రులవారు క్రొత్త ఫక్కినాటకముల విమర్శించుచు ఇట్లు వాక్రుచ్చిరి.:

"ఇతివృత్తము రుక్మిణీకల్యాణకథ యనుకొనుఁడు. అది నవనాగర కవి చేతిలో నెట్లగునో చూతము. బ్రాహ్మణుడు తెచ్చిన సందేశము రుక్మిణి యొద్దనుండి యొక Love letter

(ప్రణయలేఖ.) అది చదివికొని కృష్ణుఁడు ఇప్పటి స్కూల్ ఫైనల్ విద్యార్థివలె 'ఆపిల్లను నేను చూడనిదీ నాయభిప్రాయము దెలుపను' అని పలుకును. అందుమీఁద ఆబ్రాహ్మణుఁడు కృష్ణుని రహస్యముగ కుండినపురమునకుఁ దీసికొనివచ్చి తనయింట నునిచి, యీవార్తను రుక్మిణికిఁ దెలిపి యాబాలికను దొడ్డిదారిని గొనివత్తునని చెప్పిపోవును. ఇంతలో ఆ బ్రాహ్మణుని యిల్లాలు పెద్ద ముత్తైదువ కృష్ణుని సమీపించి 'నిన్ను చూడఁగనే ఆగోపికలకు వలె నాకును నీపై మోహము కలిగినది. నన్నును రమింపుము.' అని పైకొనును. ఇఁక నచ్చట రుక్మిణియో తన చెలికత్తెలతో విడాకులు పుచ్చుకొనుట, విధవా పునర్వివాహము ఇత్యాదులను గూర్చి ముచ్చటించుచుండును. ఇదియఁట Plot development! (కథ పెంపకము) ఇట్టిది ఛాందసులగు మన పూర్వకవు లెఱుగరు పాపము!" అని. ఇంకొకమాఱు చెన్నపురాంధ్రసభావార్షికోత్సవ సందర్భమున కీర్తిశేషులు సర్. బి. యన్. శర్మగారు అధ్యక్షులుగా శాస్త్రులవారు "నాటకచరిత్రము"ను గూర్చి యుపన్యసించి యిట్లుపసంహరించిరి.

"భరతుని నాట్యశాస్త్రము వివరింప దొరకొన్నచో నది భారతమంతయగును. ఇందలి సారాంశమిది. ఈకాలమున నాచారవంతుల మనుకొను పెద్దలు కొందఱు నాటకఖేలనము హేయమనియు నట్టువుల మొగము చూచినఁ బాప మాపాదించుననియు నాటకములును దత్సమాజములును యువజన

మును జెఱుచుటకుఁ బుట్టినవనియు అపోహపడుచున్నారు. నిక్కముగా నాటకము సాక్షాన్మహేశ్వర సంభూతము. వేలుపులకెల్ల కన్నుఁజన్నము. మహర్షి ప్రోక్తము. వేదభాగము బుద్ధిమంతులగు నాటకకర్తలును నటకులును పవిత్రకళ నారాధించి పండిత పామరకోటులకు ఆనంద వ్యుత్పత్తులఁ బ్రసాదించుటంజేసి యెల్లరకు వంద్యులుగాని నింద్యులుగారు" అని.

ఈయూర నొకసారి శాస్త్రులవారు తిక్కనను గూర్చి యుపన్యసించుచు ఇట్లు నుడివిరి:—

"తిక్కన భారతమును నెల్లూరి తెలుగు పెట్టి పాడు చేసినాఁడని కొంద అన్నారఁట. అట్లనుట మిక్కిలి దోషము. పాడి చేసినాఁడని కొమ్ముఁ గొట్టుకొని, గుడి కట్టించుట తత్పాప పరిహారము" అని.

# IV

## గోష్ఠులు.

శిష్యమిత్త్రకోటికి విస్తారము విజ్ఞాన వినోదములఁ బ్రసాదించుటలోఁ బ్రథానములు నిరంతరము సాగుచుండిన శాస్త్రుల వారి గోష్ఠులు. వానియందు నేను స్వయముగా వినిన విషయములను ఒక్కొక్క శీర్షిక క్రిందఁ బ్రత్యేకముగాఁ గ్రోడీకరించి జ్ఞాపకమున్నంతవఱకు నివేదించువాఁడను.

### "శాకుంతలము"

ఒకప్పుడు "ఆంధ్ర భాషాభిమాని సమాజము"వారి శాకుంతల నాటక ప్రదర్శనము జరిగిన మఱునాడు దానిని జర్చించుచు శాస్త్రులవారు ఇట్లనిరి.

"నాటకములను అందును కాళిదాసీయములను ఆడుటలో మిక్కిలి మెలకువ వలయును. రాత్రియాటలో విదూషకుని యొకచిఱునవ్వు మాత్రమున నాటకసారస్య మెల్ల నష్టమైనది ఎట్లనఁగా, ద్వితీయాంకాంతమున దుష్యంతుఁడు తల్లియానతి నెరవేర్చుటకుఁ దనకుబదులుగా విదూషకుని రాజధానికిఁ బంపుచు 'వీడు చపలుఁడు, నావలపును రాణివాసములకుఁ జెప్పినను జెప్పును' అని శంకించి, వానితో 'వయస్యా' మహర్షి గౌరవముచే నాశ్రమమునకుఁ బోవుటయేగాని తాప

సకన్య శకుంతలమీఁద నాకనురాగమన్న మాట కొంచెమయి నను నిజముగాదుసుమా. చూడుము.

'సరి! సరి! మేమెట! మరు కత
కరి మృగశిశులసరిఁ బెరఁగు నాటపికయెటఁ!
పరిహాసోక్తులు, మిత్త్రమ,
పరమార్థంబనుచు మదిని బాటింపకుమా'

అనఁగా,మన విదూషకుఁడు 'ఔ'నని ఒడలుపల్కుచు'నీ వాయ మాటలు నేను నమ్ముదుననుకొన్నావాయేమి?' అని ప్రహసిం చునట్లు ప్రాగల్భ్యసూచకమగు నొక చిఱునవ్వు నవ్వెను. దీని వలనఁ బిమ్మట షష్ఠాంకములో దుష్యంతుఁడు వయస్యునితో 'చెప్పి యుంటిని నీతోఁగూడ...ఎప్పుడును గోష్ఠిలో నా ప్రేయసి పేరునైనఁ బలుకవైతివి. ఏమి నీవును నావలెనే మఱచితివా' యను ప్రశ్నమునకు 'మఱవలేదు. కాని, సర్వ మునుజెప్పి నీవు చివరకుఁ బరిహాసోక్తులనియుఁ బరమార్థముఁ గాదనియుఁ బలికితివి. మట్టిముద్ద బుద్ధిగాడను దాని నట్లే గ్రహించితిని' అను విదూషకవాక్యము పొల్లయ్యెను. అందుచేఁ గథాసంవిధానమెల్లఁ బాడయ్యెను" అని.

పూర్వమొక యేకాంతగోష్ఠిలో శ్రీ వేంకటగిరి మహా రాజాగారు కీర్తిశేషులు శ్రీరాజగోపాలకృష్ణయాచేంద్ర బహద్దరువారికిని తమకును శాకుంతలములో నొక పాఠభేద మును గూర్చి యిట్లు సంవాదము జరగెనని శాస్త్రులవారు సెలవిచ్చిరి. శాకుంతలములోని

"క్షామక్షామ కపోల మానన,
ముఖః కాఠిన్య ముక్త స్తనం"

అను శ్లోకపాదమును శాస్త్రులవారు 'చిక్కిను చెక్కుటద్దములు, చిక్కిన వసం బెడలెంజనుంగవన్' అనియు 'క్షామ క్షామ కపోల మాస్య, మురముంగాఠిన్యముక్త స్తనం' బనియు తెలిఁగించి యుండిరి. ఇట మూలములో 'కాఠిన్యయుక్త స్తనం' అని పాఠాంతరము గలదు. శ్రీమహారాజాగారు "శాస్త్రుల వారూ, తమరు 'కాఠిన్యముక్త స్తనం' అను పాఠమును గ్రహించినట్లున్నది. కాని 'కాఠిన్యయుక్త స్తనం' అనుటయే యుక్తముగాఁ దోఁచుచున్నది. అదియే మా యనుభవమునకును సరిపడుచున్నది" అని నుడివిరఁట. అందులకు శాస్త్రుల వారిట్లు బదులుపలికిరఁట. "దేహమంతయు అవసాద మొందుచున్న విరహావస్థలోఁ గుచములకుఁ గాఠిన్యయుక్తి అసంభవము. స్తనశైథిల్యమునకు "ఆముక్తమాల్యద" లోని 'దిన మధ్యమాక్కరుచి ఖిద్యన్మంజరులోర్వని వాడిన పాలిండ్లను' అను ప్రయోగము ప్రమాణముగాఁ గలదు. మఱి స్వానుభవమను సమర్థనముం గూర్చి యొకమాట. ఏలినవారి యనుభవమైనంతట విరహిణి యెట్లగును? అప్పుడు 'కాఠిన్యయుక్త స్తన'మే కావచ్చును. 'కాఠిన్యముక్త స్తనం' అనునది యేలినవారి యనుభవమునకుఁ బూర్వపుదశయే" యని. ఈ సమాధానమందలి సాధుతకును చమత్కృతికిని శ్రీమహారాజాగారు చాల సంతసించిరఁట.

మఱియొక సమయమున శాకుంతల తృతీయాంకములోని 'కింశీతలైః' ఇత్యాది శ్లోకములో,

'అఙ్కే నిధాయ, కరభోరు, యథాసుఖం తే
సంవాహయామి చరణావుత పద్మతామ్రౌ'

అను ఉత్తరార్థమునకు,

'తనుఁ గరభోరుకాండ, నలతామ్రము లీ చరణద్వయంబు నంకమునఁ ధరించి యల్ల నొడికంబుగ పదమర్దనంబొనర్తునా' అను శాస్త్రులవారి యనువాదము నుదాహరించి "యిట 'ధరించు' టేమి? చొక్కాయా ధోవతియా ధరించుటకు? 'వహించి' యనుట సబబుగదా" యని యొక రన్నారు. దానిని గూర్చి మీయభిప్రాయ మేమి?" అని శాస్త్రులవారి నడిగితిని. అందులకు వారిట్లుపల్కిరి "ఇది పట్టి యెండుకట్టె యాక్షేపణ. 'ధరించి' యనుటచేఁ 'బూవువలెనో భూషణమువలెనో తాల్చి' యను ధ్వనివలన లలితశృంగారచేష్ట ద్యోతక మగుచుండఁగా, 'వహించి' యను మార్పువలన 'ఒక కట్టెలమోపునో మఱియొక బరువగు వస్తువునో మోఁచి' యను వైరస్యము సంప్రాప్తమగుచున్నది. ఇంచుకేని తేమయున్నచోఁ జిగుర్పింపవచ్చును గాని పట్టి యెండుకట్టియనో ప్రాయిలోఁ బెట్టవలసినదే" అని

మఱియొకసారి కీర్తిశేషులు శ్రీ వెంకటగిరి మహారాజా సాహెబుగారే తృతీయాంకములో

"ముహు రఙ్గుళిసంవృతాధరోష్ఠం
ప్రతిషేధాక్షర విక్లబాభిరామం,
ముఖ మంస వివర్తి పక్ష్మలాక్ష్యాః
కథమ ప్యున్నమితం నచుంబితంతు."

అనుశ్లోకమునకు

"బిత్తరి ప్రేల్లితో నధరబింబము మాటికిఁ జాటుసేయుచున్
దత్తఱపాటుతో 'వలదు తాళుఁడ'యన్ ప్రతిషేధవర్ణముల్
'చిత్తము'ప్పుచ్చిలన్, బుజము సేర్చిన నెమ్మొగ మెట్టకేని నే
నెత్తియు, నౌర! ముద్దుగొనకే విడనాడితిఁ బక్ష్మలేక్షణన్!"

అను తమ యనువాదమును బ్రశంసించుచు నిట్లు సెలవిచ్చి రని శాస్త్రులవారు చెప్పిరి.

"మీపద్యము మూలశ్లోకమునకన్నను మెఱుఁగుగాఁ దోఁచుచున్నది. 'అధరోష్ఠం' అనుటకు 'అధరబింబ' మనుటయు, 'విక్లబాభిరామం' అనుటకు 'చిత్తము ప్పుచ్చిలన్' అనుటయు మిగులబాగున్నవి. 'కథమపి' సారస్యము 'ఎట్టకేని' లోవచ్చినది. 'బిత్తరి' 'తత్తఱపాటు' అనుపదములు ఎంతయుం బ్రకరణోచితములు. ఇఁక, 'ప్రతిషేధాక్షరము' లెవ్వియో మూలమునఁ జెప్పఁబడలేదు. కాని యిట 'వలదు, తాళుఁడ' యనివాచ్యమైనవి. 'వలదు' అనుట మౌగ్ధ్యసూచకము. కాని యింతటితో నాగిన నది ప్రేమరాహిత్యమువలని నిరాకరణమునుగూడ సూచింపవచ్చును. కావున 'తాళుఁడ' యని వెం

టనే పలుకుట. ఈమాటలో నాయికాహృదయనిష్ఠితాను
రక్తి సువ్యక్తమగుచున్నది. ఇందే ముగ్ధశృంగార సర్వస్వము
గలదు. ఇంత చక్కఁగా, పరిపూర్ణముగా, కాళిదాసుని హృద
యమెట్లు కనిపెట్టఁగలిగినారు శాస్త్రులవారూ!" అని. "మహా
రాజాగారి విమర్శనైపుణికిని రసజ్ఞతకును అచ్చెరు వొందితి"
నని శాస్త్రులవారు నాతో నుడివిరి.

మఱియొకప్పుడు శాస్త్రులవారు చతుర్థాంకమున,

"శమమేష్యతిమేశోకః కథంను, వత్సే,
త్వయారచిత పూర్వం, ఉటజద్వార విరూఢం
నీవారబలిం విలోకయితః?"

అను శ్లోకమునకు స్వకీయానువాదము

"ఏవగ నాఱును జెపుమా
నీ వుటజము గడప నిడిన నెఱి మొలచినయా
నీవారబలిం గన్నుల
నేవేళంగాంచు నాకు నీవెత, పట్టీ?"

అనుపద్యమును వివరించుచు, కొందఱు 'త్వయారచిత
పూర్వం......నీవారబలిం' అనుటను 'నీవు పెట్టిన నివ్వరి
బియ్యపుఁబిండి ముగ్గు' అని గ్రహించిరనియు, పిండిముగ్గయి
నచో అది మాసిపోవును, గాలికెగిరిపోవును గావున కణ్వుల
శోకము శమింపక హృదయమున నిరవుకొనుటకు ఉపపత్తి
కాఁజాలదు. అందువలన ఈయన్వయము సరిగాదు అని శ్లోక

భాసము నిట్లు విశదీకరించిరి. "అమ్మాయి శకుంతల పర్ణశాల ద్వారమున నివ్వరిధాన్యపు గింజలు బలిచల్లియుండినది. అవి చక్కఁగా మొలచినవి. కాశ్యపులునాయన యనుష్ఠానమునకుఁ గూర్చుండునపుడెల్ల ఆ మొలకలు ఎదుటనే శకుంతలా హస్త సౌభాగ్యమును స్మరింపించుచు దృగ్గోచర మగుచుండును. తోడనే మహర్షి హృదయమున వాత్సల్యరసము వెల్లివిరియును. తత్క్షణమే యిట్టి చిట్టిచేతల మురువు చూపుముద్దుబిడ్డ కనుమాటయిపోయెను గదా యని విరహార్తి విజృంభించును. వెంటనే మహర్షి కనుగొలకులనుండి యుసిరికకాయలంత యుష్ణాశ్రుబిందువులు రాలును. నిడుదనిడుదలగు నిశ్వాసములు కడుపుఁ బెల్లగించుకొనినవో యనునట్లు బయలువెడలును. ఇది యిట్లు నిత్యము జరగుచుండును. దీనినూహించియే 'శమమేష్యతి మేశోకః కథంను వత్సే, 'ఏవగనాఉను...నీవెత, పట్టీ' యని యాతండ్రి యిటుఁగన్నుల నీరువెట్టుకొనుట" అని. ఈసంభాషణము నడచి సుమారు పదునాలుగేండ్లయినది. కాని శాస్త్రులవారి యీవర్ణనము మాత్రము హృదయస్థమై నేటికిని కనులఁ గట్టినట్లు నెలకొనినది.

ఈవల నొకనాడు సాయంతనము శాకుంతలముఁ బాఠము చెప్పించుకొనుచుండిన బాలురఁ బంపివేసి నాతో "చూపుతగ్గిపోవుచున్నదే ఇఁక నేను శాకుంతలము నెట్లు చదువఁ గలను?" అని నిట్టూర్పు పుచ్చిరి నేను విస్మయముతో "తమరు ఇప్పటికి ఛాత్రసాహస్రములకు శాకుంతలముఁ

బాఠము సెప్పియుందురు గదా. నాటకమెల్లఁ దమనోటికి వచ్చియుండు ననుకొనెదను. ఇంకను మీరు శాకుంతలమును జదువవలెనా" అని యంటిని. అందులకు వారు "ఇంతవఱకు శిష్యులకుఁ బాఠము చెప్పుటకై శాకుంతలమును జదివితిని. ఇఁక నాకై నేను జదువుకోవలయును" అని యుత్తరమిచ్చిరి. ఇది విన్నప్పుడు దీనియందుఁ గ్రందుకొనిన శాస్త్రులవారి కావ్యరసపిపాసయు విశేషించి శాకుంతలాభిమానమును డెందమును బందిగొనెను. ఇదియే శాకుంతలమునుగూర్చి శాస్త్రుల వారి కడసారి ప్రస్తావము.

## గోష్ఠులు: "ప్రతాపరుద్రీయము."

తెలుఁగుదేశమునకధీశ్వరుఁడగు ప్రతాపరుద్ర మహా రాజును ఢిల్లీసుల్తానుసేనాధిపతి ఖైదిగాఁబట్టుకొనిపోవ, ఆ రాజుమంత్రి యుగంధరుఁడు వెఱ్ఱివానివేషమున ఢిల్లీ పురముంజేరి "ఢిల్లీసుల్తాఁ పట్టుకపోతాఁ" అని నిత్యముఁ బాడుచుఁదిరిగి, చివరకు యుక్తిప్రయోగముచేఁ దనరాజును విడిపించి సుల్తానునిఁ జెఱఁబట్టి స్వరాష్ట్రమునకుఁ దెచ్చెను. అను నీకథను బాల్యముననే తానువింటిననియు, పైపాట చరణముగూడ ఆకాలమున వ్యాప్తిలో నుండెననియు ఈజన శ్రుతి నాధారముచేసికొని నాటకకథావస్తువును అల్లుకొంటినే గాని చారిత్రక పరిశోధన మొనర్చుటంజేసి కాదనియు శాస్త్రులవారొకప్పుడు నాతో సెలవిచ్చిరి. దీనినిబట్టి యిటీవలఁ జారిత్రక పరిశోధకుల మనుకొను కొందఱు బుద్ధిమంతులు శాస్త్రులవారు బుద్ధిపూర్వకముగఁ జరిత్రాంశమును దాఱు మాఱొనర్చిరని చేసిన విమర్శలెంతవఱకు మంతవ్యములో చదువరులే నిర్ణయింపఁగలరు.

ఈనాటకము బహుజనాకర్షకమైనదనియు తత్ప్రదర్శనమునకుఁ బ్రేక్షకవర్గము క్రిక్కిఱియుదురనియు అనినమాత్రము

వనే తనకు సంతృప్తిలేదని యొకమాఱు శాస్త్రులవారు నాతోఁజెప్పి నిజాభిప్రాయము నిట్లు విశదీకరించిరి: "ఈప్రేక్షక సమూహములో బహుళ సంఖ్యాకులు తురకతెలుఁగు యొక్కయు పేరిగానియొక్కయు పిచ్చివానియొక్కయు వికృత హాస్యాదులకు ఉబ్బి తబ్బిబ్బగువారే గాని, వస్త్వైక్యము, అంగాంగి తారతమ్యము, కల్పన చమత్కృతి, నిర్మాణ సౌభాగ్యము, పాత్రౌచిత్యపోషణము, ప్రధానరసము ఇత్యాదులఁ బరిశీలించి దీని విలువఁ బరిగణించువారు ప్రేక్షులపై గుణింపఁదగియుందురు ఇది ప్రౌఢనాటకమని శ్రీవేంకటగిరి మహారాజాగారు తమ విమర్శలో సూచించినారుగదా. మచ్చున కొకప్రశ్నము. ఈనాటకములో అంగిరసమేది? యని పలువుర నడిగిచూడుఁడు. వీర మనువారే యొకరోయున్న, హాస్య మనువారు వేవురుందురు కావున మూఁక మెచ్చుకోలు కన్న సహృదయుఁడగు నొక్కరసజ్ఞుని యామోదమే నా కెక్కువ ప్రీతికరము" అని.

"ఈనాటకము నింతదీర్ఘముగా నేల వ్రాసితిరి? దీనిని బ్రదర్శింపవలెనన్నఁ జాలభాగముఁ గత్తిరింపవలెఁగదా". అని యొకసారి నే నడుగఁగా, "రెండురాత్రులయాటగా దీనిని సంకల్పించి రచించితిని అట్లే యాడించితిని గూడ. సామాజికు లకు విసుపువొడము సూచన యేపట్టునను గనుపట్టలేదు. కాని రానురాను నటులకును సదస్యులకును దీక్షయు ఓపి

కయు సప్తగిలుటంజేసి నాటకము మూఁడుగంటలలోనే ముగింపవలసివచ్చినది. దీని నూహించియే తన్నిమిత్త మొనర్పఁ బడు సంగ్రహమును నేనే గ్రంథాదిని సూచించినాఁడను" అని శాస్త్రులవా రుత్తరమిచ్చిరి.

"ఈనాటకమున హిందూపక్షమునకు విజయమును మహమ్మదీయ పక్షమునకుఁ బరాజయమును గలవుగదా. ఇది హిందూమహమ్మదీయ మైత్త్రికిఁ బ్రతికూలముగాదా?" అని యొకమా ఱడిగితిని. అందులకు శాస్త్రులవా రిట్లు సమాధాన మొసఁగిరి. "ఈవిమర్శ సాధువేని హిందూదేశ చరిత్రకు సంబంధించిన నాటకమే రచింప వలనుపడదు. ఏలయనఁగా, ఈ చరిత్రయెల్ల హిందూ మహ్మదీయ ప్రభువుల పోరాటము లతో నిండియున్నది. ఇఁక యుద్ధమన్నచో నేదోయొక పక్షము గెలువవలయును, రెండవది యోడవలయును. జయాపజయముల నేపక్షములకు సంక్రమింపఁజేసినను పైవిమ ర్శకు అవకాశముండును. కావున జాతిభేదమును బెద్దసేయక, యిరువంకల గుణాగుణములనే తద్దయుఁ బాటించి, పరిష్కా రము న్యాయ్యమా, ఉపదేశము ధర్మ్యమా అనునదియే చర్చింపవలయును. మఱియు మనజాతీయోద్యమమున కను గుణమగునట్లును మహమ్మదీయ సోదరుల మనస్సు నొవ్వకుండు నట్లును ఢిల్లీసుల్తానునకు నాటకాంతమున హైందవ ప్రభువు వలన సత్కారమును సగౌరవమగు వీడుకోలును సమకూర్చి

''ఢిల్లీనాథుని బంధిఁజేసితివి'' అను పూర్వపాఠమును ''ఢిల్లీ నాథుని మిత్త్రుఁజేసితివి'' అని మార్చి హిందూ మహమ్మదీయ ప్రభుమైత్త్రితో నాటకము నుపసంహరించితిని'' అని.

ఈనాటకమందలి పాటలనుగూర్చి శాస్త్రులవారితో బహువినోదావహములగు గోష్ఠులు జరగెను. ఇట వానియం దంత మొక కొంత యుదహరింతును. ఒకపరి

శాస్త్రులవారు:—''విన్నావా, ఈశాస్త్రి పండితుఁడగుఁ గాక, కవిమాత్రము కాఁడని కొందఱమతమఁట.''

నేను:—వారి కిదే జవాబు. ప్రస్తావనలోనే

''నీటిమోఁతతీఱి నింగినెఱయ నవ్వుటో!

బోటిఁజదలఁబాలకడలి పొంగి కవ్వుటో!''

అని యింత మోహకముగా వినువారు రసోన్మత్తులగు నట్లు రచించినవారు కవిగానిచో, మఱి కవి యెవరు? నీటికాకి యేనా! తక్కినకవన మెల్ల నటుండనిండు. ఈ రెండు పంక్తులకే తద్రచయిత నిక్కమైన కవియని పందెముఁ జఱచెదను ఇందలి ప్రతిపదమందుఁగల వ్యంగ్యవైభవము నూహించి యానందిం చుటలో నొక జీవితమెల్ల వెళ్ళఁబుచ్చఁదగును.

శాస్త్రులవారు:—(సస్మితము) ''ఈచరణము పూర్వార్ధ మునుగూర్చి యొక యాక్షేపణ వచ్చినది 'నెఱయనవ్వు లేమి? చిఱునవ్వుగదా శోభావహము' అని. ఇందులకు నాసమాధాన

మిది. సవ్వినది 'నింగి', గంగివంటిది. ఒక యమాయకప్పుఁ బని కత్తె, ప్రోడతనమెఱుఁగని పడుచు, చాలసేపు నీటిబిందెలు మోయుచుండినది ఇప్పటికి మోఁతతీఱినది. బిందె క్రిందవైచి 'బ్రదికినానురా, బాబూ' అని యొకతెల్లనవ్వు నవ్వినది. అదే నెఱయనవ్వుట యనునది."

ఇంకొకపరి శాస్త్రులవారు ఈనాటకములోఁ బెక్కు పాటలు తాము కని వినినవాని యనుకరణములే యని చెప్పిరి. ఇందులకు నిదర్శనముగా "గోదారీతల్లీకి" మొదలగునదియు "మల్లీవొచ్చిందాక" యిత్యాదియు గోదావరిలోఁ బడవ నడుపువారి పాటలకు సన్నిహితానుకరణమే యనిరి.

"హరిహరీనారాయణాదినారాయణో
కరుణించవోయమ్మ కమలలోశనుఁడా"

అను చరణమును విశాఖపట్టణమునందు పండువుదినములలో దాసరులు వీథులఁదిరుగుచుఁ బాడుచుండఁగా దాను వింటిననిచెప్పి శాస్త్రులవారు దాని నట్లే తానును బాడి విని పించి కడుంగడు వినోదముం గూర్చిరి.

మఱియొకపరి శాస్త్రులవారు

"అన్నమైతే నేమిరా, మఱి సున్నమైతే నేమిరా
అందుచే తీపాడుపొట్టకు అన్నమే వేతామురా".

ఇత్యాదిగాఁగల పాటయందలిభావమును ఇంచుక మార్పుతో

నిట్లు వివరించిరి: "ఇక్కాలమునఁ గొక తెగ వేదాంతులు ప్రబలి నారు. వారిమత మేమనఁగా మాకు ధనలోభ మక్కఱలేదు, ధనమే కావలయును. కామముతో బనిలేదు, కామినియే గావలయును. భోగవాంచల వదలినారము. భోగ్యములే వలయును. ఇట్టిదే ఆ వెంగళప్ప శెట్టి వేదాంతము" అని.

ఇంకొకమాఱు శాస్త్రులవారి నిట్లడిగితేని: "రాజు తన రాష్ట్రమునకు మరలఁ జేరినపిమ్మట, పేరిగాఁడేమైన మనకేమి? వాఁడు స్వజనమును జేరుట, వారి సారాయిగోష్ఠులు, వైపు చేష్టలు ఇత్యాదికమునందు వికటహాస్యముండుఁగాక, దీని వలనఁ బ్రధానకథకుఁ బ్రయోజనమేమి?" అని. ఇందులకు శాస్త్రులవా రిట్లు ప్రత్యుత్తర మొసంగిరి: "ఇంచుక యాలో చించినఁ బ్రయోజనము తేటతెల్లమగును. ప్రభువుపరోక్ష మున యుగంధరమంత్రి చాకలివానిని గద్దియపైఁ గూర్చుండఁ బెట్టి రాజు సురక్షితముగ నగరిలో నున్నాఁడనిపించి, పేరిగానిచేత దర్బారునాటక మాడించినది ఆ మహారాజుతో నెవరు చెప్ప సాహసింతురు? యుగంధరుఁడేని అట్లు చెప్పుట సంభావ్యమగునా? అది రాజున కేల తెలియవలయునందురా? తెలిసిననేగదా ప్రభువునకు మహామంత్రి నీతిమహిమ గోచ రమై, ఆతనియెడఁ దనయాదరమును కృతజ్ఞభావమును వేయి మడుంగులగును. 'ద్విషద్బందీకృతుఁ మత్ప్రియఁ ఇల్లొందిం చితి చాకినేని' అని ప్రభు వామహానుభావుని బ్రశంసించుట పొసఁగును. ప్రభువు మంత్రులయొక్క యీ సంబంధ మేగదా

కథాపరమావధి. ఇది యెట్లు సంఘటిల్లినది? పేరిగాఁడు తన వారితో 'దూడపేడ' 'బత్తెపేడ' 'దంచెము' 'చటకోపము' 'పెత్తాతదురదమారాజు' 'నీవుకంపెల్లివి, నాకుఁ బనికిరావు' ఇత్యాదులం బ్రలాపింపఁగా, ఎల్లి తన 'మామ'కుఁ బిచ్చి పట్టిన దనుకొని యుగంధరమంత్రిసమక్షమున మహారాజుగారితో నిట్లు ఫిర్యాది చేసికొనును.

'ఎల్లి—మరుండి యీాయన పెత్తాతదురదమగారాజం టుండి.

యుగం—[రాజుంగని, చిఱునగవుతో] విశదమగు చున్నదా?'

దీనివలనఁ బ్రతాపరుద్రునకుఁ దనపరోక్షమున మహా మంత్రి యుగంధరుఁడు ప్రయోగించిన యుక్తియు, ప్రద ర్శించిన ప్రతిభయుఁ దేటపడును. కావున ఈ ఘట్టము మిక్కిలి ప్రయోజనకారియే" అని.

ఈ నాటకము "విద్వత్ప్రికాండకులకు సుకవిమిత్త్రు లకు శ్రీమద్వేంకటగిరిసింహాసనాధీశ్వరులగు మహారాజా సర్ వెలుగోటి శ్రీరాజగోపాలకృష్ణయాచేంద్ర బహద్దరువారికి" అంకితము గావింపఁబడినది. రసికావతంసు లైన యావిద్వత్ప్రి భువు లీకృతియెడఁ బరమాదరము నొంది దీనింగూర్చి తమయాభి ప్రాయమును 1893-వ సంవత్సరము అముద్రితగ్రంథచింతా

మణ్యానుబంధముగఁ బ్రకటింపించిరనియు, అది నాలుగుపుటలే యయ్యు సూత్రప్రాయమై యిదానీంతనులు నాలుగువందల పుటలునింపువిషయము నిమిడ్చికొనియున్నదనియు దానిచేఁ దనకు నిరతిశయానందమొదవెననియు శాస్త్రులవారొకప్పుడు చెప్పిరి. మఱియొకప్పుడు తనతండ్రిగారీనాటకమును జిత్తగించినవిధము నిట్లు వర్ణించిరి: "మాతండ్రిగారు మాతమ్ముఁడు సూర్యనారాయణశాస్త్రిని ఈనాటకము వినిపింపుమని యతఁడు చదువఁగాఁ దాను వినుచుండెను ఇది కొన్నిదినములు నడచెను. ఎంతగొప్పవారిని, ఎట్టిపండితులను జూచియు జంకినదిగా దీఘటము. కాని మాతండ్రిగారు చదివించుకొనునప్పుడు మాత్రము నేను సమీపమునసే యిటునటు పచారుసేయుచు వారికేసి పుల్కు పుల్కునఁ జూచుచు ఏపట్టున నేమనుదురో యని మిగులదిగులువడితిని. కాని యేమియుననక సొంతముగా విని వారు నేను వినునట్లుగా మాతమ్మునితో 'మీఅన్న బాగుగానే వ్రాసినాఁడురా' అనిరి. మహర్షితుల్యుఁడైన మానాయనగారి యీయమోఘవాక్కు వినినప్పుడు నాయెదలో నెట్టి బ్రహ్మానందము పొంగిపారలెనో వర్ణింపఁ దరముగాదు. నా జీవితములోనెల్ల ధన్యతమమైన నిముస మదియే" అని.

---

# VI

## గోష్ఠులు : "బొబ్బిలి"

తన "బొబ్బిలినాటకము" పుట్టుపునుగూర్చి శాస్త్రుల వారు ఒకప్పుడు నాతో నిట్లు చెప్పిరి. "బాల్యమునుండియు బొబ్బిలియుద్ధకథను జంగాలు పాడఁగాఁ బలుమారు విని రస తన్మయుఁడ నైతిని. ఈనాకౌతుకమునకు రసజ్ఞశేఖరులగు వెలమదొర శ్రీ వేంకటగిరి మహారాజా రాజగోపాల యాచేంద్ర బహద్దరువారి మైత్రి దోహదమయ్యెను. శ్రీవారి యెడను తదీయులపట్లను మదీయాదరాభిమానములు ఈ నాటకమునందు ఆద్యంతము ప్రతిఫలించుచున్నవి. ఇయ్యది శ్రీవారికి అత్యంతము ప్రీతిపాత్రము కాఁగలదని నమ్మి శ్రీవారి హస్తముల నిద్దాని నర్పించుభాగ్యమునకై యువ్విళులూరు చుంటిని. కాని యేతద్రచన పూర్తియై యిది అచ్చులోనున్న పుడే ఆదొడ్డప్రభువు అకాలబలవన్మరణముపాలైరను పిడుగు వంటివార్త విని శోకోపహతుఁడను భగ్నాశుఁడను అయితిని" అని.

మఱియొకమారు ఈనాటకము ద్వితీయముద్రణములోఁ దానొనర్పఁదలంచిన మార్పులనుగూర్చి యిట్లు వచించిరి. "ఈ నాటకము ప్రకటితమైనపిమ్మట దీనిలోనుడివినట్లు బొబ్బిలి విజయనగరసంస్థానమునకు లోఁబడినది కాదనియు, రంగరాయఁ

డు విజయరామరాజునకు పాలెగాఁడు కాఁడనియు అతనితో పాటిపోఁడాగల స్వతంత్రప్రభువే అనియు బొబ్బిలినుండి నాకొకవార్త వచ్చినది. ఇయ్యది యేతత్కథానాయకోత్కృష్ట మునకు మఱింత యుపకరించుటంజేసి, యవ్విధమున కథను మార్చి తదనుగుణముగ

'నాగేంద్రుఁడొకఁడేలు నాపాలెగాఁడు'

అనుపాఠమును

'నాగేంద్రుఁ డేలుచున్నాఁ డొకరుఁడు'

అని సవరించి, యీరీతిగనే నాటకములో వలయు తావులనెల్ల దిద్దికొని ద్వితీయముద్రణమునకు వేచియున్నాఁడను" అని. కాని యది ఘటిల్లులోపుగనే శాస్త్రులవారు పరమపదించిరి. "ద్వితీయముద్రణము ఘటిల్లిన అప్పటికి నేనుండిన" అను నాటకపీఠికలోని వ్రాఁత యీ యేష్యమును సూచించుటకే వారికి స్ఫురించెను గాఁబోలు!

"'బొబ్బిలి' మేలా? 'ప్రతాప' మేలా? 'ప్రతాప' యందలి యల్లికజిగిబిగి. 'బొబ్బిలి'లో సడలినదనియు శిల్పదక్షతంబట్టి 'బొబ్బిలి' 'ప్రతాప'కు లోకువయనియు ఒకరన్నారు. నీయభి ప్రాయమేమి?" అని శాస్త్రులవారొకసారి నన్నడిగిరి నేనిట్లు విన్నవించితిని. 'కథావయవనిర్మాణచాతురియందు 'ప్రతాప' యే మేలుచేయి యగుఁగాక. 'బొబ్బిలి'లో హృదయావేగ మధికతరము 'ప్రతాప'లో క్వాచిత్కముగానైనది యిటఁ

బ్రతిఘట్టమందును సామాజికహృదయ ముత్థూత లూగు చున్నది. నేను తమకర్పించిన 'Sonnet' (పద్యము)లో నిట్లు వ్రాసియున్నాను

'Whose mellow heart in melting numbers flowed
For lion-like Bobbili's lamented plight'

అని. నిజ మరయుదుమేని యీ రెండునాటకముల కథా స్వభావము వేర్వేఱు. 'ప్రతాప' కథకు అధికముగవలయునది నీతివిశేషము, యుక్తిప్రయోగము. 'బొబ్బిలి'కథకుం బ్రధానము శౌర్యవిజృంభణము. భావోద్రేకము. కావున తత్తదుచితముగ ఆయానాటకముల శిల్పవైఖరి కొంతవఱకు వేఱుపడినది. ఔచితియే శిల్పమునకు జీవనమగునేని ఈ రెండునాటకములును సమానములే. ఇది నాకుఁ దోఁచునది" అని. శాస్త్రులవారు నాయభిప్రాయమునకుఁ దనయంగీకారముం దెలిపి 'బొబ్బిలి'లోని భావోద్వేగమున కుదాహరణముగా

"విజయబంధువులార, వేజన్మములకైనఁ
దీర్చుకోనేర మీ పేర్చుబుణము;
చేతులారంగఁ బూజించితి మెవ్వారి
ఖండించితిమి వారి ఖడ్గధార!
లీలలుమీఱ లాలించితి మెవ్వారిఁ
బడఁగ్రుమ్మితిమి వారి బాకుమొనల!
ఆఁడుఁబురువు లేదు! హాతమయ్యె మగకూన!
కోట పాడయ్యె నింకేటి కిచట?

నాదుప్రాణంబు వేంగళనాయకుండు
నన్నెదురుసూచుచున్నాఁడు కన్నునొవ్వ;
అరులబొందులమీఁదుగా నతనికడకు
క్షణములోఁ జేరుదము రండు రణపథమున"

అనుపద్యమును సాభినయముగఁ జదివి వినిపించిరి. వారు నిలువఁబడి పఠించినతీఱునఁ బద్యమునందలి కరుణరౌద్ర బీభత్సభయానకాది రసభావములు ప్రత్యక్షమైనట్లుండెను.

"కోటపాడయ్యె నింకేటికీచట ?"

అని పలుకునప్పుడు దైన్యనిర్వేదములు పరమావధిం బొందెను. గీతమునకు వచ్చుసరికిఁ బూర్తిగ మాఱుగొంతుపడెను. అందలి వీరమెట్లు లోకోత్తరమో కంఠస్వరమును అలౌక్య మనిపించెను. ఇఁకమీఁద రంగారాయఁడు ఈలోకమువాఁడు కాఁడు అనునది కంఠస్వరము చేతనే సుస్పష్టమయ్యెను. కన్ను నొవ్వ ఎదురుచూచుచున్న వేంగళనాయకుంఘను ఆతనికడకు రణపథమున అరుల బొందులమీఁదుగా క్షణములోఁ జేరఁ బోవు రంగారాయఁడును తత్క్షణమ సాక్షాత్కరించిరి. పద్యా రంభమందు వారివదనమున ప్రకరణోచితము మానవసహా జము అగువెత దట్టముగఁ గన్పట్టెను. కనులు చెమర్చెను. కను కొలఁకుల నశ్రువులు తొలకాడెను. పద్యాంతమునకు వారి నేత్రములు విచిత్రముగ విశాల వినిశ్చలములయ్యెను. కన్నీ రెల్ల నింకిపోయెను. వీరము మిన్నుదాకెను. అప్పుడే సూర్య

మండలమును భేదించుకొనిపోయి స్వర్గతుఁడగ్యెనో యను నట్లు మోమున మానవాతీతమగు దివ్యతేజము మిలుమిట్లు గొలుపుచుఁ దాండవమాడుచుండెను. ఈదృశ్యముంగాంచి ధన్యోస్మి యనుకొంటిని. ఇట్టి వీరే ఆపాత్రముఁదాల్చి నటించి నచో నెటులుండునో గదా! అని యబ్బురపడితిని.

ఏతన్నాటకప్రదర్శనాంతమున నొకతఱిఁ గొందఱు సామాజికులు "అబ్బా యెంతయుద్ధము! ఎంతయుద్ధము!" అనుకొనుచుఁ బోవుచుండిరఁట. దీనిం బ్రస్తావించి,యొకమాఱు శాస్త్రులవా రిట్లనిరి. "వాస్తవముగ నిందు యుద్ధప్రదర్శనమే లేదుగదా! ఇదియెల్ల నివేదకులు యుద్ధవార్తలు వచించు నాశ్చాటమువలని ప్రభావమే గదా! ఈ యుద్ధము నట్లు ప్రత్యక్షముగఁ బ్రదర్శించుట అసాధ్యము. ఒకవేళఁ బ్రయత్నించినచో హాస్యాస్పదమగును. దీని నెఱిఁగియే మనపెద్దలు లాక్షణికులు రంగము రణరంగము గావించుటను నిషేధించిరి. వార్తానివేదనలు సారవంతములైనచో, యుద్ధప్రదర్శనము లేకున్నను వీరరసము కొదువపడదని యీ నాటకమే చాటుచున్నది గదా. ఈపట్టును కొందఱు నట్టువులు నివేదకపాత్రధారులు అజ్ఞతచేఁ బాడుచేయుచున్నారు. ఈనివేదనలు ప్రాయికముగా వికటహాస్యగర్భితములై యున్నవి. కాని నివేదకపాత్రములు ఆయాపట్టులకువలయు విస్మయశోకభయాదులనే ఉత్కటముగ నటింపవలయును. ఇయ్యది అతిమాత్రమగుటచే సదస్యులకు వెగటుతోఁచి నవ్వు రావలయును అంతి

యగాని నివేదకపాత్రధారులు తామే హాస్యమనుభవించున ట్లభినయించుట రసాభాసము గావించుటయే” అని.

మఱియొకమారు శాస్త్రులవారు పాపారాయభాషిత ములో

“రాజనంబులరాశి భోజనార్థంబుగాఁ
దంచుకై వడి వీని దంచినాఁడ,
పనసకాయను దోరపదనఁ గూరగ వండఁ
జెక్కుకై వడి వీనిఁ జెక్కినాఁడ,
పొట్లకాయను డియ్యఁబులుసు దప్పళముకై
తఱుగుకై వడి వీనిఁదఱిగినాఁడ
అంటుమామిడిపండు నారగింపునకుఁగాఁ
గోయుకై వడి వీనిఁ గోసినాఁడ”

అను పద్యభాగమును గూర్చి యొకరియాక్షేపణ నిట్లు చర్చించిరి. “దీనిలో Kitchen atmosphere (వంటయింటి వ్యవహారము) గలదఁట. కావున నిది వెలమవీరుఁడగు పాపారాయనినోట ననుచితమఁట. ఇందులకు నాసమాధాన మిది. కవిబ్రహ్మ తిక్కన విరాటపర్వములో అర్జునునియుద్ధమును వర్ణించుచు,

‘గోరఁబోఁజినమాడ్కిఁ గొన్నిటిఁ జక్కసాఁ
బాలుగా వ్రయ్యలు వాపివాపి,
బాడిస నఱికినభంగిఁ గొన్నింటిఁ దు
త్తునియలుగా బిట్టు త్రుంచిత్రుంచి,

వెస అంపమున నిడ్డ వసిగఁ గొన్నిటి నిసు
మంతలుగా నుఱుమాడి యాడి,
పనివడి ఱోలఁగొట్టినలీలఁ గొన్నింటిఁ
జిఱునుగ్గుగాఁ బొడిసేసిసేసి,
యడరి పొదివినబలము నానాయుధములఁ
బ్రతిహతంబులఁ గావించె నతిరయమున'

అని నుడివినాఁడే, యిట Carpentry atmosphere (వడ్రంగి వ్యవహారము) కలదు. ఇది వీరవర్ణన కనుచితము అని యాక్షే పింపవలదా? ఈపద్యము అర్జునభాషితముగాదు. కవివాక్కు అందురేమో ? కవిమాత్ర మేమి వడ్రంగియా ? కానప్పుడు ఆయననోట నిది యెట్లుచితమగును? ఈయాక్షేపణయెల్ల స్థూల దృష్టిప్రభావము. భారతములో వర్ణ్యము 'అడరిపొదివిన బలము నానాయుధములను (అర్జునుఁడు) అతిరయమునఁ బ్రతిహతములఁ గావించిన'విధము. అందులకు ఉదాహృత పద్యమందలి యుపమానములకన్న నుచితతరము లుండఁబోవు. కవికి వర్ణ్యభావము పఠితృహృదయమున గాటముగ నాటిం చుటకై యెట్టి యుపమానసామగ్రి నేని గైకొన నధికారము కలదు. అట్లే పాపారాయభాషితమగు పూర్వోక్తపద్యమం దును పాపారాయఁడు అప్పుడే పలికియుండినది 'పూర్వము పాపారాయఁడను. ఇప్పుడు రాకాసిమన్నీఁడనయితిని' అను భావమునకు ఈపద్యము వివరణము. ఆత్మహతుఁడగు పాప య్యను గాంచినప్పటి బుస్సీభాషితము

'హాహాహా ఏమి ఘోరవధ !
వేలుగాలక్షలు మాంసరాసులు నభోవిస్తారమౌ విస్తరిగా
గ్రాలగా భుక్తికిఁగూరుచుండి మును శర్వద్ధ్యానమందున్న జే
తాలుండో యన రాజమాంసఖలసక్త ప్రేక్షుబద్ధాసనా
భీలుండాత్మహతుండు పాపయయుటుగా వీక్షింపఁగా ప్రేక్షమై'
అను దానియందును 'భోజన' పద్యతాత్పర్యమే సూచి
తము. పట్టరానిపగఁబట్టిన బొబ్బిలిబెబ్బులి పాపయ్య 'రాకాసి'
యాఁకలి తీఱుటకుఁ గావించిన రాజవధయొక్క ఘోరవైచిత్రి
మనస్సున కెక్కించుటకే పై యుపమానములు గ్రహింపఁ
బడినవి" అని.

ఒకసారి శాస్త్రులవారు నాతో "మీ షేక్సుపియరు
'Mid Summer Night's Dream' అను నాటకములో ఎలిజ
బెత్తురాణిని, 'Macbeth' లో జేమ్సుప్రభువును సవ్యాజ
ముగఁ బ్రస్తుతించెనని చెప్పుదురే. అట్లే నేనును 'బొబ్బిలి'
లో అవకాశముఁ గల్పించుకొని ఆంగ్లజాతిని వేంకటగిరి ప్రభు
వంశమును బ్రశంసించినాఁడను చూడు" మని యీక్రింది
పట్టుల నుదాహరించిరి.

(చతుర్థపంచమాంకముల నడుమ ప్రవేశకము.)

పౌరులు——ఇంగ్లీసు లేంటండీ ?

అప్పన్న——వాళ్లమతంలో 'యేంజెల్సు' అంటే దేవతలు, వీళ్లు
దేవతల అవతారమని ఆపేరువచ్చింది. ఆలాగే వీళ్లు
న్నచోట అధర్మం జరగదంటారు.

"అప్పన్న—వెలమదొరలలోనే మఱికొందరు నరసింహామూర్తి వంశస్థులు. అందుచేత వెలమదొరలముందర భూలోకంలో మరేవీరులున్నా తలయెత్తలేరు.

సన్నాసి—ఓయి తెలివి! సర్వజ్ఞసింగమనాయనింగారని మఱివొాక మూలపురుషుడు రా. ఆయనికి తెలియని శాస్త్రం గాని విద్యగాని లేనందున ఆయనకి సర్వజ్ఞ బిరుదు వొచ్చింది. ఆయన వెంకటగిరి రాజధానిగా తూర్పుసీమంతా యేలినదొర."

"ఈనాటకములో బుస్సీనోటను హసేనాలినోటను గ్రాంథిక బాష నేల ప్రయోగించితిరి?" అని యొకసారి శాస్త్రులవారి నడిగితిని. అందులకు వారిట్లు ప్రత్యుత్తరమిచ్చిరి. "నాటకరచన యొక కళ. అనఁగా కొన్ని నియమములతోఁ గూడుకొన్న కల్పన. కేవల వాస్తవానుకరణము గాదు. దైనిక జీవితములో మన మొనర్చు స్నానపానాదినిత్యకృత్యములెల్ల నాటకములోని కెక్కుట అసంభావ్యము గదా. మఱియు నాటకములోని యాత్మగతములు జనాంతికములు మున్నగునవి సదస్యులు వినునట్లు బిగ్గరగా నుచ్చరించుట స్వభావేతరము గదా. అట్లయ్యు అవి నాటక లక్షణోక్తములే. స్థలకాలాది కతిపయ నియమములకు లోఁబడి, కొన్ని సంప్రదాయముల ననుసరించి, కొన్ని లక్షణముల కనుగుణముగ నొనర్పఁబడిన రసవంతమగు కల్పనయే నాటకశిల్పము. అట్లుగాక నాటకము కేవల

వాస్తవానుకరణమే కావలయుచో, ఆశుకవులుదక్క నెవరేని పద్యములలో భాషింతురా ? పాడుచు నేత్తురా? జూలియస్ సీజరును ఎధియోపియారాణియగుక్లెయొపాత్రాయును ఇంగ్లీషు పద్యములలో భాషించిరా? అప్పుడు రోము, వెరోనా, బెల్మాంటు మున్నగు నగరములలో ఆంగ్లమేనా వాడుకభాష ? ఇట్టి ప్రశ్నములు బయలుదేరును నాటకములలో నెడియేని కేవల వాస్తవానుకారి గాదనువిమర్శ పొరఁబాటు. ఎట్లు జరిగెను? అనునదిగాదు, ఎట్లు జరిగియుండఁదగును? అనునదియే నాటకములోఁ బ్రతిపాద్యము అదియే ఔచిత్యనిర్వాహమనునది. దానిని గమనించియే మన పూర్వాలాక్షణికులు ఉత్తమపాత్రలకు సంస్కృతభాషను తదితరులకు పలుతెఱంగుల ప్రాకృతములను విధించిరి. దాని ననుసరించి యిట నేను ఉత్తమపాత్రలకు జాతిమతవివక్ష లేక గ్రాంథికాంధ్రము తదితరులకు తత్తదుచిత వివిధగ్రామ్య భాషలను వాడికొన్నాను బుస్సీయును హసేనాలియును వారి పదవింబట్టియు గుణముంబట్టియు ఉత్తమపాత్రలలోఁ జేరినారు కావున వారికి గ్రాంథికాంధ్రమే. ప్రయుక్తమైనది” అని.

---

## VII

## గోష్ఠులు: ఇతర తత్కృతులు.

"ఉషానాటకము"లోని

"కష్టమాల్మి కాఁడ, ఖండేందుతరి నెక్కి
వెల్గుఁదెడ్లు వయిచి విన్ను వాఁక
నురవణింతు వహహా! యుదిరి కేవిచ్చెదఁ,
జెలియయుండు రేవుఁ జేర్చు నన్ను."

అనుపద్యంపు భావమునకు సామ్యముగా నేనొకప్పుడు పాఠముసెప్పిన "Great peoples of the Ancient World" అను పరాణగ్రంథమునందు ఈజిప్టు దేశీయులలో చంద్రుఁడు ఆకాశమను జలరాశిని దాఁటుటకుఁ బుణ్యాత్ముల కేర్పడినపడవ యని యైతిహ్యమున్నట్లు చదివి దానిని శాస్త్రులవారికి మనవి చేసితిని శాస్త్రులవారు పూర్వోక్త పద్యభావము తాము ఊహామాత్రముగాఁ గల్పించుకొనినదే అనియు అది సంస్కృతాంధ్ర వాఙ్మయములందు తా మెఱింగినంతవఱకు అపూర్వమే అనియు ప్రాచ్యనాగరకతలో ప్రథమస్థాన మాక్రమించిన యీజిప్షియనుల వాఙ్మయమునఁ గేవలకల్పితమగు తన యూహ కాధారము గానవచ్చుట మిక్కిలి ముదావహ మనియు వాక్రుచ్చిరి.

పై నాటకములోనిదే చిత్రరేఖా భాషితము.

"కాదుభంగపాటు, కల్యాణమగుఁగాని
నిష్కళంకరూపనిధుల కెందు;
రాహువక్త్ర గోచరంబౌనె శశిరేఖ?
పరమశివునిమౌళిఁ బరఁగుఁగాక"

అనుపద్యము ప్రస్తావనకు రాఁగా అందు 'సౌందర్యమునకు మంగళాంతము తప్పదు.' అను తాత్పర్యము సకలకవి మతసిద్ధాంత మనఁదగుననియు స్పెన్సర్ (Spenser) అను మహాకవి తన "Fairy Queen" అను కావ్యములో ఒక సౌందర్యవతికి సింహమొండు చూపుమాత్రన లోఁబడి మచ్చికయై ఆమెవాహనమయ్యెనని సౌందర్యమహిమను వర్ణించినాఁడనియు పలువురాంగ్లకవులు పద్యభావమునే పలు రీతులఁ బలికిరనియు విన్నవించితిని. అందులకు శాస్త్రులవారు వల్లెయని "పద్యభావము సర్వకవిసామాన్యమైనను ఏతదీయ భావనాపరికరము మాత్రము భారతీయసాంప్రదాయానుసారి యగుట గుఱితింపఁదగును" అనిరి.

"రసమునకు అలంకారములు ఆవశ్యకములా? రూపకోత్ప్రేక్షాద్యలంకారముల నుజ్జగించి కావ్యమున ముఖ్యముగా శృంగారఘట్టములందు వర్ణనలరచించుట సాధ్యమా?" అని యొకమాఱు శాస్త్రులవారినడిగితిని. అందులకు వారు ఇట్లు పలికిరి. "ఈపద్యమునుగూర్చి యేమనెదవు?

అట్లుగానె పుట్టినట్లుగా నగపడు!
నోలి నెదిగె ననుట యొప్పరాదు!
మార్పుపొందురీతి మదిలోన దోఁపదు!
అసురమాయొ! కొమ్మ యమరమాయొ!"

అని దానికి నేను "ఈవర్ణన 'జగన్మోహిని' యైన యుషకు ఎంతయు నుచితమై అద్భుతముగా అపూర్వముగా నున్నది. మఱి యిట నలంకారమో అతిసూక్ష్మముగా అరసినఁగాని కానిపింపదు" అని యంటిని. శాస్త్రులవారు మఱియు నిట్లనిరి: "అట్టి యందగత్తియను కలఁగనినాఁడు కావుననే అనిరుద్ధుఁడు

"ముదితారత్నము మోముఁగాంచునపుడా
మోమే గనంజొచ్చితిన్;
మదిరాక్షిద్యుతిఁ జూడఁజొచ్చిన నదే
మాధ్యద్దశన్ జూచితిన్;
సుదతిన్ జే రడుగన్ గులంబుఁ దెలియన్
సున్నయ్యె నా తెల్వి; హా!
యిదిగో, పండిదిగో, హుళిక్కి! యని న
న్నేఁచెన్ విధాత్రుం డహో!"

అని తనవిభ్రాంతికి వగవవలసివచ్చెను" అని.

"ఉషానిరుద్ధుల శృంగారము చాలవఱకు ప్రబంధ ఫక్కిలోఁ బడినదనువిమర్శకు ఏమనెదరు?" అని యొకసారి.

శాస్త్రులవారి నడిగితిని. వారిట్లు బదులుపల్కిరి. "వాఙ్మయ చరిత్రలో పురాణయుగము. ప్రబంధయుగము, నాటక యుగము ఇత్యాది విభజన యున్నట్లే ప్రతిమానవుని జీవిత చరిత్రయందును అట్టి దశాపరిణామముగలదు. ఒకవయస్సులో అనఁగా బాల్యతారుణ్య సంధియందు, ప్రతిపురుషుఁడును ప్రబంధనాయకుఁడే, ప్రతి స్త్రీయును ప్రబంధనాయికయే. అది వ్యక్తిజీవితములో ప్రబంధదశ యనఁదగును. ఉషానిరుద్ధులు ఆ వయస్సులో నున్నారు. కావున ఉదాహృతశృంగారము వారికి సహజమే, ఉచితమే. మఱి పైవిమర్శ సేయువారన్నరో వయస్సుమీఱి శృంగారము చాలవఱకు ఉడిగినవారు. ఇదియే అందలి రహస్యము" అని.

"గంభీరవేది కరేణుకలు ప్రేక్షకులకు వెగటుగొల్పుట లేదా?" అని యొకపరి శాస్త్రులవారి నడిగితిని. అందులకు వారి ట్లుత్తరమిచ్చిరి. "ఔను వెగటుగొల్పుటయే వారిని ప్రవేశపెట్టుట యందలి యుద్దేశ్యము. ఉషానిరుద్ధులమ్రోల దృష్టిబొమ్మలుగా నుండుటకును రక్కసిలోకంపు వెక్కసము ప్రేక్షకమానసముల కెక్కుటకును వారిరువురు సృష్టింపఁబడిరి, కావున నాటకములో వారి రూపు, భాషయు వర్తనమును వారికుచితములగుటంజేసి రసపోషకములే" అని.

"'మాళవిక'ను అనువదించితిరే. ఏల యాడింపలేదు?" అని యొకసారి శాస్త్రులవారి నడిగితిని. దానికి వారు "నర్తింపఁ

గల మాళవిక లభింపనందువలననే. నటప్రజ్ఞాదారిద్ర్యమే అందులకుఁ గారణము" అని నిట్టూర్పువుచ్చిరి.

"రత్నావళి"లోని రాజువాక్యము

"అమృతాంశుండు మొగంబు, కల్వలు కనుల్,
హస్తంబు లంభోజముల్,
విమలోరుల్ కదళోదరంబులు, బిసా
భిఖ్యంబు లౌ బాహువుల్,
రమణీ, హ్లాదకరాఖిలాంగకవు, మా
రక్రూరబాణాగ్ని చేఁ
గమలం గ్రాఁగిన నాదుగాత్రములకాఁ
కణఁగౌఁగిటన్ మాన్పవే."

అను పద్యముఁ జదివినప్పుడు "బిల్హణీయము"లోని

"తామరసాక్షి, నీనిశిత
దారుణ వీక్షణ తీక్ష్ణబాణముల్
వేములు నాటి నాహృదయ
వీథి వ్రణంబొనరించెఁ జూడుమా,
ఈమెయినౌషధ ద్వితయ
మీయవె, త్రావెదఁ బూత పూసెదన్;
నీమధురాధరామృతము,
నీకుచకుంకుమపంక మేర్పడన్."

అనుపద్యము జ్ఞప్తికి వచ్చినదని యొకప్పుడు శాస్త్రుల వారితో నేనంటిని. శాస్త్రులవా రిట్లనిరి. "ఈ రెంటను ప్రియాసంగమము నాయకవిరహాపనోదనోపాయ మగుట సామ్యము. మఱి తారతమ్యమును గలదు. బిల్హణీయమునందలి పద్యము వ్రణవైద్యోచితముగా ఇంచుక ముదురుపాకమున నున్నది. రత్నావళి పద్యమున 'మారక్రూర బాణాగ్ని' వలని 'కాక'కు 'హ్లాదకరాఖిలాంగక' యగు ప్రియురాలి యాలింగనమను శైత్యోపచారమే నివారకముగా వర్ణింపఁబడినది. ఈవర్ణనము సుకుమారతరముగను కావ్యోచితముగను ఉన్నది." అని.

"విక్రమోర్వశి" నాటకపుఁ దోలియాట సొబగును అందు ముఖ్యముగా బెంగుళూరు రంగస్వామి అయ్యంగారి యభినయకౌశలమును మెచ్చుకొని శాస్త్రులవారు దానిని మరల ఆడఁగాఁజూడ నభిలాషపడిరి. వారికోరిక మెయి ఆనాటకము కొలఁదిదినములలోనె మరల ప్రదర్శింపఁబడెను. ఆరెండు ఆటలును నాటకకళాప్రియులకు మఱపునకుఁ రాని మహోత్సవసమయములు.

ప్రస్తావవశమున ఈనాటకము నాలవయంకమునుగూర్చి మాక్డొనెల్ పండితుఁడు "ఈఘట్టముతో సరిపెట్టఁదగినపట్టు సంస్కృతనాటకములలోనేగాక ప్రపంచనాటకవాఙ్మయము లోనే గనుపట్టదు" అని తెలిపినయాశయము నుదాహరించి దానిపై శాస్త్రులవారియభిప్రాయ మడిగితిని. "ఈ ప్రశంస

యెంతయు తగియున్నది. ఇందు అతిశయోక్తి యేమియు లేదు. నిజముగా 'విక్రమోర్వశి' చతుర్థాంకము కవికులగురువు ప్రతిభ సాధించిన మహాద్భుతమని నుడువఁదగినదే" అని శాస్త్రులవారు పలికిరి.

"ఉత్తర రామచరితము" ప్రథమాంకములో అష్టావక్రుల భాషితమగు

"జామాతృయజ్ఞేన వయం నిరుద్ధాః,
త్వం బాల ఏవాసి, నవం చ రాజ్యం,
యుక్తః ప్రజానా మనురఞ్జనేస్యాః,
తస్మాద్యశో యత్పరమంధనం వః."

అను శ్లోకమును శాస్త్రులవారు

"అల్లుని మఖంబు సంకెలయయ్యెమాకు,
క్షీరకంఠుండ, వేలెడు దారిక్రొత్త,
ప్రజల రంజింపఁ దివురు మెప్పాటనైన,
దాననగుకీర్తియే మేలిధనము మీకు."

అని యనువదింపఁగా, మూలమందలి 'బాల' శబ్దమునకు 'క్షీరకంఠ' ప్రయోగము బాగుగా లేదు అని యొక రాక్షేపించిరఁట. "ఏతన్నాటకకర్త భవభూతిమహాకవియే 'మహావీర చరితము'లో చతుర్థాంకమున జనకమహారాజభాషితమునందు

"పుత్రసంక్రాన్తలక్ష్మీకైః
యద్వృద్ధేక్ష్వాకుభిర్ధృతం,
త్వయా తత్ క్షురకంఠేన
ప్రాప్త మారణ్యకం వ్రతం."

అనియు పంచమాంకమున సంపాతిభాషితము౦డును.

'అనేకయుగ జీవిన్యాశ్చ్రేతా యస్యాశ్చ్రయోఽశనీ,
సా క్షురకణ్ఠాంతం వత్సం లజ్జయన్తీ నలజ్జితా.'

అనియు 'క్షురకంఠ'పదమును బ్రయోగించియున్నాఁడు. ఇది మిక్కిలియుఁ బ్రౌఢము హృదయంగమము అగు గీర్వాణజాతీయ ప్రయోగము (Sanskrit idiomatic usage). దీనికిఁ గేవల శబ్దార్థమునే గ్రహించుట యాక్షేపకుల భ్రమకుఁ గారణ మైనది. ఇదానీంతనపాండితి యిట్లు పరిఢవిల్లుచున్నదిగదా?" అని శాస్త్రులవా రెంతయుఁ జింతిల్లిరి.

ఒకపర్యాయము శాస్త్రులవారు తమ యనువాదపద్ధతిని వివరించుచు సాధ్యమయినంతవఱకు సమాసముల విడఁదీసి సంస్కృతపదములకు తెనుఁగుమాటలనే వాడుట తమకు వాడుకయయ్యును ఒక్కొకచోట రసపోషణార్థము ప్రకర ణానుసారముగ మాతృకయందలి దీర్ఘసమాసఘటితని పరుష పదబంధమును అట్లే గైకొనవలసివచ్చెనని వాక్రుచ్చి యం

దులకు నిదర్శనముగా "ఉత్తర రామచరితము" లోని జృంభ కాస్త్రవర్ణనము.

"జ్వాలాజిహ్వాకా వలయి తోత్కటకోటిదంష్ట్ర
ముద్గారి ఘోరఘనఘర్ఘరఘోష మేతత్
గ్రాస ప్రసక్త హాస దన్తక వక్త్రయన్త్ర
జృంభావిడమ్బి వికటోదరమస్తుచాపం"

అను శ్లోకమునకు,

"జ్వాలరసనయుక్కటార్తి దంష్ట్రలనుజుట్టఁ
బ్రోద్గిరద్ఘన ఘర్ఘర స్ఫూర్జనంబు
ఆశనసక్తక ఖత్కృతాంతాస్యయంత్ర
జృంభ వికటోదరముగాత మీధనుస్సు"

అని తమ యనువాదము నుదాహరించిరి.

## VIII

## గోష్ఠులు: సారస్వతవిమర్శ.

"మేఘసందేశము" పాఠ్యగ్రంథము కాఁగా, దానిని క్రిష్టియన్ కాలేజి విద్యార్థులకు ప్రవచించునపుడు అందలి ప్రతిపదప్రయోజనసారస్యములు తనమనస్సు కెక్కుటచే తటస్థించెననియు ఆయనుభవము తనకే యద్భుతమోదావహమై దానిని అచటి విద్యార్థులకే గాక ఆంధ్రపాఠకలోకమున కెల్ల వెల్లడింపవలయునని యుత్సాహము జనించెననియు అదియే తన మేఘసందేశవ్యాఖ్యారచనమునకుఁ గారణ మనియు శాస్త్రులవా రొకప్పుడు సెలవిచ్చిరి.

"శృంగారనైషధము"లో కీర్తిశేషులు వేంకటగిరి మహారాజా శ్రీగోపాలయాచేంద్రబహద్దరువారికి విబుధ మనీషానికషములు కూలంకషములు అగు పెక్కు సందియములు లుండెనఁట. అవియెల్ల శాస్త్రులవారి సర్వంకషాఖ్య వ్యాఖ్యచే నిరస్తము లయ్యెనని మహారాజాగారే తనతో సెలవిచ్చినట్లు శాస్త్రులవా రొకగోష్ఠిలోఁ జెప్పి యందులకు రెండుదాహరణము లొసంగిరి. కథారంభము మొదటిపద్యము తొలిపంక్తియగు "తపనీయ దండైక ధవళాతపత్రీ తోద్దండ తేజః కీర్తిమండలుండు" అను చరణములో "ధవళాతపత్రము" రాజచిహ్నముగాఁ బరికీర్తితమే గాని 'తపనీయదండము'నకుఁ బ్రమాణ

మేమి? అని మహారాజాగారి సందేహమఁట. దీనిని వారు నిజాస్థాని కేతెంచు నిఖిలపండితుల నడిగి నిరుత్తరులగు చుండిరఁట. శాస్త్రులవారి వ్యాఖ్యలో "షడ్జస్తశుద్ధ హైమం నవహస్త్వసగై కెవండంచ" అను "బృహత్సంహిత" యుద్ధారము వలన మహారాజాగారు తత్ప్రమాణ మెఱిఁగి సంశయము వీడి సంతసించిరఁట అట్లే నలదమయంతులగోష్ఠిని వర్ణించు "ఆరామాంరమణుల్" ఇత్యాది పద్యమును వ్యాఖ్యానింపుఁడని పండితుల నడిగి వారు "కేళీమయూరాంగనా చారీమండలతాండవారభటికా" అను భాగమునకు "ఆడునెమళ్లయొక్క చారీమండలము తాండవారభటి అను నృత్యవిశేషములను" అని యర్థము చెప్పఁగనే "వీరికి గ్రంథపాండితియే గాని అనుభవ రాసిక్యము లేదు" అనుచుండిరఁట. శాస్త్రులవారి వ్యాఖ్య యందు, కేళీమయూర = క్రీడార్థమయిన పెంపుడు నెమళ్ల యొక్క, చారీమండల = ఆనామముల నృత్యవిశేషములు, అంగనా = అందగత్తెలయొక్క, తాండవారభటికా = నాట్య ప్రకారవిశేషములు ... 'కేళీమయూరాంగనా' అని యేకవిధముగా విభజింపమికిని ఆడునెమళ్లని వివరింపమికిని కారణము వానికి కుంచె లేమి. ఆయాటసొంపు కుంచెచేత, ముఖ్యముగా ఆట చెప్పునప్పుడు మహాకవులు మగనెమలినే చెప్పుదురు." అని చదివి, "ఇంతకాలము వదలని యిచటి నా సందియము ఇప్పుడు తీఱినది" అని మహారాజాగారు అమందానంద మొందిరఁట. మఱియు శాస్త్రులవారితో మహారాజాగారు "శాస్త్రులవారూ,

రాచనగళులలో నడయాడు నెమళుల కేళీకహాస్యము తమ కెట్లు తెలిసినది ?" అని యడిగిరంట. అందులకు "ఆముక్త మాల్యదలో

"పరజుబడి రొంపిం ద్రొక్కం
జరణంబులం జుట్టి పసిడిచాయకడుపులం
బొరి నీరుకట్టె లమరెను
బిరుదులు హాలికులు దున్నంబెట్టిరొ యనంగన్."

అను పద్యమునందు హాలికులు రొంపి దుక్కిలో గనిమవెం బడి దున్నుచుంబోవుటయు, బంగరువన్నె కడుపుగల నీరుకట్టె పాములు కడుపు నెలి కగుపడునట్లు వారిపాదములకుం జుట్టు కొనుటయు ఆస్థితిలో అవి ఆ హాలికులు దున్నుటలో తమకు సాటిలేరని ధరించిన బంగారపు గండపెండేరములో అను నట్లుండుటయు ఇదియెల్ల ఎండక న్నెఱుంగని మహాప్రభువు శ్రీకృష్ణదేవరాయల కెట్లు గోచరమయ్యెనో అట్లే నాకును మయూర చారీమండలమును అంగనాతాండవారభటియు వానిని మార్చిమార్చి వీక్షించి సరిపోల్చి చూచుటయందలి వినోదసారస్యములును గోచరమైనవి" అని శాస్త్రులవారు ప్రత్యుత్తర మొసంగిరంట. "ఔను అందుచేతనే గదా మహా కవి కాళిదాసుఁడు 'నఖలు ధీమతా మవిషయోనామ' (ప్రతి భావంతుల కగోచరమేమున్నది?) అనినాఁడు."అని మహారాజా గారు పలికిరంట.

"ఆముక్తమాల్యద" తన కభిమాన ప్రబంధమనియు "అది లేఖకముద్రకాదిదోషములవలన అపపాఠములపాలై అగ్రాహ్యము గహనము అను నపనింద మోయుచుండుటం గాంచి యత్యంత ఖిన్నుఁడనై యెంతక్లేశమేని యోర్చి సాధుపాఠయుక్తము విపులవ్యాఖ్యాన సహితముగ దానిం బ్రకటింప నిశ్చయించుకొంటి"ననియు, "అది జీర్ణదేవాలయ పునరుద్ధరణమువంటి పవిత్రపుణ్యకృత్యముగ భావించితి"ననియు, "ఆమహాత్కార్యము స్వశక్తిచేఁగాక కేవలము చూడికుడుత్తదేవిప్రసాదముచేతనే నెఱవేరెనని నమ్ముచుంటి" ననియు శాస్త్రులవారొకమాఱు సెలవిచ్చిరి.మఱియు"ఏతద్రచనాక్లేశ మపనయించుకొనుటకే అప్పుడప్పుడు విక్రమోర్వశీయాదినాటకము లాంధ్రీకరించుచుంటి"ననియు కార్యాంతరప్రవృత్తియే తనకు విశ్రాంతిదాయకమనియు వారు నుడివిరి ఔరా, మనము శ్రద్ధతో బహుకాలము పఠింపవలయు నాటకరాజములు వీరికి అలుపుఁదీర్పు లీలావినోదము లయ్యెఁ గదా ! అని నే నాశ్చర్యపడితిని.

"నాచనసోముఁడు కవిత్రయములో ననేకులకన్న మిన్నయనియు తిక్కనకన్నను కొన్నియెడల నెక్కువ యనియు, 'అలికంబున నక్షిని డాచినట్టి సర్వజ్ఞుఁ'డనియు కొందఱు వాకొనినారే దానింగూర్చి మీయభిప్రాయ మేమి?" అని యొకపరి శాస్త్రులవారి నడిగితిని. అందులకు వారిట్లు నుడివిరి. "ఆముక్తమాల్యద పీఠికలో 'ఆంధ్రకవనవిద్యా మునిత్రయము

ముసు తచ్ఛిష్యవర్గముతో సాటికి దించుట తగవుకాదు.' అనియు, 'తిక్కనసోమయాజి విజయము'లో సోమనకవనము తిక్కనపరువడింబట్టియే వ్రాసినదై నను దానిని మించుటకే యుంకించుచున్నను పెక్కు కారణముల చేత దానికి కొండికయనియే చెప్పవలసినదై యున్నది' అనియు 'లక్షణమం దెట్లో సకల విషయములందును నన్నయ తిక్కన శంభుదాస సోములు యథాపూర్వము శ్రేయస్తరులు.అందరలోను తిక్కన లలితతముఁడు." అనియు రచించినాఁడను. ఇదియే మదీయనిశ్చితాభిప్రాయము" అని.

ఎట్టిన "నృసింహపురాణము''లో వసంతఋతువు వర్ణనగల

"కాముఁడు లోకమంతయును
 గైకొని పట్టముగట్టికొన్నఁ జే
రామని సేయుపండువుల
 యం బొడఁగూడిన దివ్యగంధముల్
గా మెఱుఁగారు క్రొవ్విరు లె
 లర్చినసం పెఁగ లొప్పెఁ గామసం
భ్రామిత కామిచిత్తశల
 భంబులు గ్రందుగఁజెంది మ్రందగన్."

అను పద్యమునందు "కామిచిత్తశలభంబులు" "దివ్యగంధములఁజెంది మ్రందుట" యేమియో నాకు బోధపడనందున శాస్త్రులవారిని అన్వయము చెప్పుఁడని యొకతఱిఁ బ్రార్థించితిని. వారు "పద్యము మరలఁ జదువు"మనిరి. అట్లే చదివితిని.

"ఏదీ మరల చదువుము" అని వారు నేను జదువఁగా నాతోఁ గూడఁ దానును బఠించుచు "దివ్యగంధముల్" అనుమాట వచ్చుసరికి "ఆగు" మని పఠనము నిలిపి ఆపదమునే రెండు మూఁడు సారు లావర్తించికొని నిజాననమున నూతన సద్యో వికాస ముట్టిపడఁగా నావంకఁ జూచి "'దివ్యగంధముల్' గా వయ్యా 'దివ్యైకంబముల్' అనఁగా 'దీపపుసెమ్మెలు' కావున నే కామిచిత్తములు అను మిడుతతండము వానిపైఁ గ్రందుకొని మ్రందుట. పాఠమట్లు సవరింపుము" అని సెలవిచ్చిరి. అపుడు పద్యభావము నాకుఁ దేటతెల్లము కాఁగా, శాస్త్రులవారి సద్య స్స్ఫూర్తికిని, కవిహృదయజ్ఞతకును విస్మయపరవశుఁడనైతిని. ఈ "నృసింహపురాణము"నెడ శాస్త్రులవారికి అపరిమితా దరము కలిగియుండెను.

ఇందు తృతీయాశ్వాసమున గ్రీష్మఋతువర్ణనలో

"పరిమెయిమెట్టితోఁ దొల్త బహుభంగులఁగ్రాలెడు మిత్రుఁజైత్రునిం
బొరిగొనవచ్చె గ్రీష్మమను పోచ్చెపుఁబేరఁ బురారి ఫాలభా
సురపటుచహ్నియంచు వెఱఁజొచ్చినమన్మథుఁగాచె నత్తఱిన్
సరసశిరీషకేసరలసన్మహిళామృదులాలకాగ్రముల్."

అను పద్యముంగూర్చి "The author is a god!" (ఈకవి యొకదేవుఁడు !) అని వ్రాసియు,

"పగళు లెలతోఁట నీడలు బ్రాంతి యయ్యెఁ,
బగళులును రేలు దనుగాలి బ్రాంతి యయ్యె,

రేలు వెన్నెలబయళులు ప్రియములయ్యె,
రేలుఁ బగళులు నిద్రలు ప్రియములయ్యె."

అను పద్యముప్రక్కను "ఏమి మహానీయుఁడయ్యా!" అని లిఖించియు శాస్త్రులవారు ఎఱ్ఱన కవిత్వమహత్త్వమును శ్లాఘించినారు.

ఈ మహాకావ్యమునకును నైషధాముక్తాదులకుంబలె సాధుపాఠ విపులవ్యాఖ్యానసహితముద్రణము ఎన్నటికి లభించునో గదా.

"నాగరిక" శబ్దము అసాధువు. "నాగరక" సాధువు అని క్రిస్టియన్ కాలేజి తెలుఁగుపండితులు కీ॥ శే॥ దండిగుంట సూర్యనారాయణశాస్త్రులవారు మాకు పాఠముచెప్పుచు ప్రసంగవశమున నుడివిరి. అంత నేను 'విజయవిలాసములో'

'నాగరికముద్రగల మంచిబాగరి యంట'

అని యున్నదే దానిని వేంకటరాయశాస్త్రులవారు తమ వ్యాఖ్యానములో అసాధువని పేర్కొనలేదే, యేల? అని యడిగితిని. "పేర్కొనలేదా ? అట్లయినచో ఆలోచింపవలయును" అని మాపంతులు పలికిరి. పిమ్మట దీనినిగూర్చి శాస్త్రులవారినే అడిగితిని. వా రిట్లు చెప్పిరి. "వేంకటకవి నాగరి - బాగరి అను యమకచమత్కారమునకై అట్లు ప్రయోగించినాఁడు. యమక శ్లేషాదులయందు పెక్కుకవులు వ్యాకరణమునెడ స్వాతం

ర్ష్యము వహించియున్నట్లు 'ముసలిమానులు' ఇత్యాదిప్రయో గములవలనఁ దెలియనగును. ఇట్టిపట్టులం బ్రయుక్తశబ్దదోష ముం బ్రకటించుట కవి యుద్దేశించిన చమత్కృతిం బోరివుచ్చి రసభంగము గావించుటగా భావించి 'నాగరిక' శబ్ద మసాధు వగుట నిట నేను దడవలేదు" అని.

"ఏమండీ, నే నసాధువులని పేర్కొన్న దుష్టప్రయో గము లనేకములు నావ్రాఁతలందే గలవఁట. ఉన్న వనుకొం దము. నేనేమి దేవుఁడనా? నేను వాడినమాత్రనే తప్పులు ఒప్పు లెట్లగును? ఇది యేమివాదము!" అని శాస్త్రులవా రొకమాఱు ప్రసంగవశమున బలికిరి. దీనియందే శాస్త్రులవారిం గూర్చిన యనేకాక్షేపణలకుఁ బ్రత్యుత్తర మిమిడియున్నదని తలంతును.

మదీయము "ఆంధ్ర మేఘసందేశము" వ్రాఁతప్రతిని దిద్ది పెట్టుఁడని వేఁడుటకు మదరాసులో శాస్త్రులవారియొద్దకుఁ గొనిపోయితిని. అప్పుడు వారు అస్వస్థులుగా నుండినందున ఒక కొన్నిపద్యములుమాత్రము చదివి వినిపించితిని. వానిలో

"చిరము వెలిఁగి నీ మెఱుపు చేడియ వాడ, నేదేని యొక్కమం
దిరవలభిఁ గపోతములు నిద్రిల నయ్యెడ రేయివుచ్చి భా
స్కరుఁడుదయింపఁగామరలఁ జల్పుప్రయాణపు శేష; మాలసిం
పరుగద మిత్రవాంఛ నెఱపఁ బనివూను నుదారమానసుల్."

అనుపద్యము విన్నమాత్రముననే "<u>చిరమున్స్ఫురించి</u>" "<u>భాస్క</u>రునుదయంబునన్" అనుసరణల సూచించిరి. అట్లే

"కనుగవనశ్రువుల్ దుముకఁగావడిఁ గాముకులష్ట ఖండితాం
గనలకుఁ; గాఁకఁబాయువడిగా రవిమూర్గ; మతండు పద్మినిన్
దనకలిఁదీర్పఁడా మరలి తామరమోము హిమాశ్రుధారఁబు
చ్చు నిజకరాళికడ్డమగుచో నతఁడొందునమందరోషమున్."

ఆనుపద్యమును చివర పాదము మొదట "పుచ్చు" అనినవెంటనే ఒకసెమికోలన్ (విరామచిహ్నము) వేసి యుత్తరార్ధమును రెండువాక్యములుగా విభజింపుమనిరి.

---

# IX

## గోష్ఠులు: హాస్యము.

లోఁగడ నుడివినట్లు, శాస్త్రులవారి వ్రాతయందును వాక్కునందును ప్రతిపదమునను హాస్యరసము వెల్లివిరియుచుం డును. అది వారికి స్వాభావికమని చెప్పనొప్పును. ఉపన్యాస ములందువలెనే గోష్ఠులందును వారు ప్రాయశఃగంభీరముగా నిర్వికల్పముగా భాషించుచు శ్రోతలను కడుపుబ్బునట్లు నవ్విం తురు. అది వారి శక్తివిశేషము. ఒకవేళ ఎప్పుడేని వారు నవ్విరా దిక్కులు మాఱుసెలగవలయునంత బిగ్గరగా నవ్వు దురు. అది వారి నిష్కల్మషహృదయమునకు సూచకము. వారి హాస్యోక్తులు కోటానుకోటులు. వానికి దిక్ప్రదర్శనముగా నించుక యిట నుదాహరింతురు.

ఒకమాఱు శాస్త్రులవా రొకసభలో నుపన్యసించుచు "వ్యాఖ్యసేయునపుడు ప్రకరణమునుబట్టి అర్థము నిర్ణయింప వలెఁగాని యేదే నొక తాత్పర్యము మన మనసున నిడుకొని తదనుగుణముగా నానార్థనిఘంటువుల సాధనమున ఇచ్చవచ్చిన శబ్దార్థములాఁగుట పాడిగాదు" అని పలుకఁగా సభను భంగ పఱుపవలెనని బలగముతో వచ్చియుండిన ప్రతిపక్షియొకఁడు "అదెట్లు?" అని యడ్డుప్రశ్న వైచెనఁట. అందులకు శాస్త్రుల వారు "శుక్లాంబరధరం ఇత్యాది శ్లోకమునకు గాడిదపర

ముగా అర్థము చెప్పినట్లు" అని బదులుపలికిరఁట. అంతట నిలు
వక ఆప్రాశ్నికులు మరల "అది యెట్లు చెప్పవచ్చును?" అని
యడిగిరఁట. అందులకు శాస్త్రులవారిట్లు ప్రత్యుత్తరమిచ్చిరఁట.
"శుక్లాంబరధరం = శుభ్రమైన బట్టలు అనఁగా చలువగుడ్డలు
మోయునది, విష్ణుం=సర్వత్ర వ్యాపించునది, ఒకచోటనిలువక
తిరుగుచుండుట గాడిదకు స్వభావము. శశివర్ణం = చంద్రుని
వన్నెగలది, గోదావరిప్రాంతపు గాడిదలు తెల్లనివి గదా. చతు
ర్భుజం=నాలుగుబుజములు (చేతులు కలుగవు గావున) కలది
ప్రసన్నవదనం=సౌమ్యమగు ముఖముగలది ఇది ఏవార్థకము.
వదనమేవ - వదనమే - ప్రసన్నము. ఏలయన గాడిదను వెనుక
నుండి సమీపింతుమా దానికాళ్ళతన్నులే ప్రాప్తి. ధ్యాయేత్ =
ధ్యానింతును. సర్వవిఘ్నోపశాంతయే = సమస్తవిఘ్నములు
శమిల్లుకొఱకు. విఘ్నశాంతికి గార్ధభప్రార్థన యెట్లనఁగా ఇట్లు.
ఓ గాడిదయ్యగారూ, దయచేసి ఓండ్రపెట్టకుఁడు. మీరు
ఓండ్రపెట్టినచో ఈరేవునందలి మీతోడిగాడిదలెల్ల ఒక్క
మొగి నోండ్రపెట్టును. ఆశబ్దముచేత మాకేమియు తోఁచకుం
డును మాపనులకు భంగము కలుగును. కావున 'ఓ గాడి
దయ్యా, ఓండ్రపెట్టవద్దు' ఇట్టిది ఆప్రార్థన!" అని ఇది విని సభ
యెల్ల గొల్లున నవ్వగా, ప్రతిపక్షులు చల్లఁగా జాఱుకొనిరఁట.
ఈవృత్తాంతమును శాస్త్రులవారే యొక గోష్ఠిలో చెప్పిరి.

ఒకనాటకమునకు శాస్త్రులవారు ఒద్దికలు (Rehearsals)
జరుపుచుండఁగా వారి మిత్రులొకరు వానిని జూడఁగోరిరఁట.

అందులకు శాస్త్రులవారు "అయ్యా, బిడ్డ పుట్టినపిమ్మట బొడ్డు కోసి స్నానము చేయించి యితరులకు చూపుదురా? ప్రసవ వేదనలో నుండఁగనే ప్రదర్శింతురా? ఇప్పుడు మీరు ఒద్దికలు చూడవేడుట ప్రసవమగుచున్నప్పుడు పరికింపఁగోరుట వంటిది!" అని యామిత్రునికోరికను వారించిరఁట.

ఒకనాడు శాస్త్రులవారు పలువురు పండితులనడుమఁ గొలువుండ, వారి నాటకసమాజపు నవుకరి వారిని సమీపింపఁగా, అప్పటి సంభాషణను నిలిపి వచ్చినవాని పనిని గావించి పంపివేసి, అభ్యంతరమునకు క్షమార్పణగా తోడిపండితులతో నిట్లని పలికిరి.

"ఒక శాస్త్రులు షట్ఛాస్త్రపాండితీమండితుఁడఁట. కాని ప్రారబ్ధవశమున శాస్త్రాధ్యయనపూర్వదశలో అతనికి ఒక గొల్లపడుచుతో సంబంధము తటస్థించెనఁట. దానివలనఁ గొంత సంతాన మేర్పడెనఁట. ఆకూనలు ఈశాస్త్రులు పెద్దసభలలో శాస్త్రార్థము గావించునపుడు 'ఏమే నాయనా' అని యామహాబ్రాహ్మణుని డాసి పీడింపఁగా నతఁడు చేయునదిలేక యోర్మివహించునఁట. సభ్యులెల్లరు "ఇంతచదివిన సద్బ్రాహ్మణునకు ఈసంతాన మెట్లు సమకూడెనో!' అని యబ్బురపడుచుందురఁట. అట్లే నాకును ఈ నాటకసమాజముతో బాదరాయణసంబంధము. ఇది వదలించుకొనుదమన్న వదలదు. కావున ఐనదికాని మ్మని తెగఁబడి యీజంజాటము సాగించుచునే యున్నాను

శాస్త్రియని పేరుపెట్టుకొనిన యీవృద్ధశ్రోత్రియునికి నాటి కాలచే పెందులకయ్యా? అని మీరు శంకింపవచ్చును గదా. అందులకు మీకు లోకానుభవజ్ఞులకు ఈసమాధానము చెప్పి కొన్నాఁడను" అని.

ఒకసారి శాస్త్రులవారు మందహాసముతో నిట్లనిరి. "ఏమండీ, మనపూర్వులకు 'Democracy'(ప్రజాప్రభుత్వము) 'వోట్లు' మున్నగునవి తెలియవందురే, మనుచరిత్రములో ఈ పద్యభాగము చూడుఁడు!

'పోలంజూచి యితండ యర్హుఁడని యేభూపాలుఁడీ వచ్చినన్
సాలగ్రామము మున్నుగాఁ గొనఁడు'.

ఇట 'పోలంజూచి' అనఁగా Poll (పోల్) తీసికొని చూచి, విస్పష్టపద్ధతిని 'వోట్లు'గణించి ప్రవరునకు అధికసంఖ్య 'వోట్లు' రాఁగా అతఁడే అర్హుఁడని నిర్ణయించిరని మావ్యాఖ్యానము ! కావున మన యాంధ్రకవితాపితామహునకు 'పోల్' స్వరూపము బాగుగా తెలిసియుండవలెను గదా!" అని.

మఱియొకసారి అట్లే చిఱునగవుతో "ఏమండీ, ఆంగ్లేతరాధ్యాపకులను అస్మదాదులను 'మునిషీలు' అనుదురు గదా. దానిభావము తెలియునా? మేము సాధారణ మనుష్యులము

గాము. మనిషికి కొమ్మువచ్చినఁ గదా మునిషి యగును!" అని పలికిరి.

ఇంకొకమాఱు ప్రబంధములనుగూర్చి ప్రసంగించుచు శాస్త్రులవా రిట్లనిరి. "నేను ప్రబంధములకు చిహ్నము నొక దానిని గనిపెట్టినాను. అదేమనఁగా, కృతి ప్రారంభమున శ్రీ కారము వెనువెంటనే 'స్తనములు'గోచరింపవలెను. చూడుఁడు.

'శ్రీవక్షోజ కురంగనాభ మెదపై' ఇత్యాది
'శ్రీరామా కుచమండలీ' ఇత్యాది

కొండలకు చుట్టకంపు గుఱుతగునట్లే ఇదియు ప్రబంధైక చిహ్నముగాఁ బరిగణింపఁదగును. ఇదియే కాఁబోలు ప్రబంధవాసన యనునది!" అని.

# X

## గంభీర సంభాషణలు.

శాస్త్రులవారితో సారస్వతవిషయకము లగు సల్లాపములే గాక ప్రాయికముగా ఏకాంతగోష్ఠులందు కావ్యేతరము లగు సామాన్యవిషయములఁగూర్చి ముచ్చటించుభాగ్యమును ఈవ్యాసకర్తకు లభించినది. అట్టి సమయములందు శాస్త్రుల వారి సంభాషణలు గంభీరములుగను వారి పాండితీక్, సాధుచరితకు, నిర్మలాంతఃకరణమునకు ప్రతిబింబముగను పరిఢవిల్లుచుండెను. అందుఁ బ్రధానముగ స్మృతిపథమున నిరప్రకొనిన నాల్గింటినిమాత్ర మిటఁ బొందుపఱిచెదను.

శాస్త్రులవారియం దత్యంతభక్తిగల కాంగ్రెసుప్రచారకుఁడొక యువమిత్రము ఒకప్పుడు శాస్త్రులవారిని "అస్పృశ్యతా నివారణోద్యమముఁగూర్చి మీ యభిప్రాయ మేమి?" అని ప్రశ్నించెను. (అప్పటికి 'హరిజన' నామకరణ మింకను జరగియుండలేదు.) శాస్త్రులవా రిట్లు పలికిరి. "ఈ యస్పృశ్యతకు మూలకారణము మానవప్రకృతియందే కన్పట్టుచున్నది. అదియేమన 'నేను ఇతరులకన్న హెచ్చుగా నుండవలయును' అను దురహంకారము. ఈయహంభావమే యెల్ల యనర్థముల కును మూలము. ఇదియే మానవసౌభ్రాతృత్వమునకు వేరుపురుగు. నిక్కముగా ఇదియే 'మాల'గుణము, 'అస్పృశ్యము'.

ఇది యందఱిలోను కొద్దిగనో గొప్పగనో కాన్పించుచున్నది. ప్రతిమానవుఁడును ఆత్మపరీక్షణ మొనర్చికొని యీ దురహంకారరూపమగు నస్పృశ్యతను రూపుమాపి సర్వసమత్వము నలవఱుచుకొనుటయె శ్రేష్ఠమగు నస్పృశ్యతానివారణము." అని.

ఒకసారి మలబారునందలి కన్యావిక్రయ దురాచారమును జర్చించుచు, ప్రాసంగికముగా నేను శాస్త్రులవారితో "మీరు సంఘసంస్కరణమునకుఁ దీవ్ర ప్రతికూలురనియు, కేవల పూర్వాచార పరాయణులనియు శుద్ధసనాతనులనియు ఒక వదంతి వ్యాపించియున్నది. ఇది సత్యమేనా?" అని యడిగితిని. అందులకు శాస్త్రులవా రిట్లనిరి. "ఈవదంతి మిక్కిలి పొరఁబాటు. సంఘ సంస్కర్తృవేషధారులు నాస్తికులు కతిపయులు ధర్మశాస్త్రములకు ప్రకరణవిరుద్ధములగు నపార్థములఁ గల్పించి లోకుల మోసగించుటం గాంచి సహింపనేరక నేను సాధ్వర్థ ప్రకటనమునకై వారితో డీకొంటినేగాని, యాశాస్త్రములెల్ల శిలాశాశ్వతములై యెల్లప్పుడును ఒకేతీఱున అనువృత్తములు గావలయునను పాషండుఁడను గాను, సంస్కరణమాత్రమున కెల్ల విముఖుఁడను గాను. ఈకాలపుస్థితిగతుల ననుసరించి మన సంఘమునఁ బెక్కుమార్పు లావశ్యకములనిగూడ నంగీకరించెదను. కాని 'యెవరికివారే యమునాతీరే'అను నరాజకమతమునకుమాత్రము నేను సమ్మతింపను. ప్రతివ్యక్తికిని సంపూర్ణ స్వాతంత్ర్యము కలుగునేని, అది దుర్వినియోగము గాక

తప్పదు; ఆనాడే సంఘము విచ్ఛిన్నమై నాశము నొందును. మఱియు పూర్వోదాహృతులు సంస్కర్తృవేషధారులును నాస్తికులును వంచకులును సంఘసంస్కార మొనర్చుటకు ఎంతయు అనధికారులు, అనర్హులు. మనసంఘము బాగుపడ వలయుననిన, నొకయాస్తికమహాజనపరిషత్తు స్థాపితము గావ లెను. అందు హైందవమతమున నమ్మికగల శ్రద్ధాన్వితులు ధర్మశాస్త్ర పారంగతులగు పండితులు స్వార్థపరిత్యాగులగు మహనీయులు సభ్యులుగా నుండవలెను. ఈపరిషత్తువారు సాంఘికదోషములనెల్ల సమగ్రముగఁ జర్చించి యార్యధర్మ మూలసూత్రములకు విరోధముగానివిధమున సవరింపవలెను. వారి యనుశాసనములకు హైందవ సంఘీయులెల్లరు బద్ధులు గావలెను. ఇది మదీయనిశ్చితాభిప్రాయము. ఇట్టిపరిషత్తును నెలకొల్పుటకు సజ్జను లెవరేని యుద్యమించునెడల నాచేత నైన సాయమొనర్పగలవాఁడను" అని. దీనిని శాస్త్రిఎమర్శ కులు సంఘసంస్కారాభిమానులును సనాతనులును ముఖ్య ముగాఁ జిత్తగింపఁ బ్రార్థితులు.

ఒకనాడు వివిధమతములు, ఏకమతములో భిన్నశాఖలు, వీని తారతమ్యము ప్రస్తావనకు రాఁగా, శాస్త్రులవా రిట్లనిరి: "హైందవ బౌద్ధ క్రైస్తవ మహమ్మదీయాదులగు లోక ప్రఖ్యాతిపడసిన మతములును, అద్వైతవిశిష్టాద్వైతద్వైతాది మతభేదములును అన్నియు మనకు సమాన సమ్మానార్హములే. ఏలయన ఏతన్మతప్రవక్తలెల్లరు అస్మదాది పామరజనకోటి

దృష్టిలో హిమగిరిశిఖరముల యున్నతిని గైకొన్నవారు వారిలో హెచ్చుతక్కువలు కొలతవెట్ట నెవరికోలఁది? కాని యొక్కవిషయమును గుఱితింపవలయును. మతములన్నియును మనకు ఊహాలే. అవి యెంతయేని యున్నతములు, ఉదార ములు, ఉత్తమములు, శ్లాఘ్యములు గావచ్చును. కాని యన్నియు ఊహాలే. వానియందు పరమసత్యమును ప్రతి పాద్యము గావచ్చును. కాని ఆసత్యము ఇందేగలదు, అందు లేదు అని యెవరు నిర్ధారింప వలంతులు? బుద్ధిసూక్ష్మత గలచో ఎట్టిమతమునేని ఆక్షేపింపవచ్చును. తర్కమునకు తుదిమాట లేదు. అది 'పంకమ్ములోని కంబమ్ము'గదా. పరమ సత్యస్వరూపమో గ్రంథపఠనమువలనను వాదకౌశలమువల నను గోచరించునది గాదు, ఎవరికి వారు స్వానుభవముచేఁ బ్రత్యక్షీకరించుకొనవలసినదే. స్వానుభూతమగు నపరోక్షజ్ఞాన ముదయించువఱకు ఈమతములన్నియు ఊహామాత్రములే. వీనిలోని సత్యాసత్యము నిర్ణయించుట మానవబుద్ధికి అందని యలవికానిపని. మనోవ్యాపారము నధిగమించిన యాత్మాను భవమే యందులకు ప్రమాణము" అని. వైదిక లౌకిక గ్రంథ జాలమెల్లఁ దఱచి కడవెళ్ళఁగఱచిన యాస్తికాగ్రేసరులు శాస్త్రులవా రిట్లు పలుకుట మాకెంతయు వింతఁగొలిపి కను దెఱపి సలిపెను.

మఱియొక మఱవరానిదినము. అది పౌర్ణమి సాయం సమయము. చంద్రోదయమైనది. పిండియారఁబోసినట్లు పండు

వెన్నెల పర్విననది. ఇంటిముంగిలి బయలిలో మేమిరువురమే ఆ సీనులము. ప్రకృతి యెంతయు ప్రశాంతము ప్రసన్నముగఁ దోఁచెను. తదీయమనోజ్ఞతా లీనమానసులమై బ్రహ్మానంద మగ్నులగు యోగివలెఁ గొంత తడవు మేము మౌనమున నుంటిమి. అమృతకిరణ ప్రభావమునం జేసి మానవలోకమందలి మాలిన్యము పుణ్యపాప సమ్మిళితకర్మ సంఘాతము సకలము కరఁగిపోయి వృద్ధజీవులెల్ల క్షీరకంఠులుగను భూలోకము స్వర్గలోకముగను మాఱిపోయినట్లు నామదికి స్ఫురించుచుండు నప్పుడే శాస్త్రులవారు నాతో నిట్లనిరి. "ఏమయ్యా, ఎప్పుడును వెన్నెలగానే యుండరాదా? లోకమునఁ జీఁకటియేల? దుఃఖ మేల? జరయేల? మృతియేల? మార్పేల? ద్వంద్వమేల? 'చీకటి యుండఁబట్టియేగదా వెన్నెలసుఖము. కష్టములేనిచో సుఖము విలువ యెట్లు తెలియును? కాదా. సుఖదుఃఖాది ద్వంద్వము లెల్ల మాయాస్వరూపములే' ఇత్యాది వాదములు తర్కము నకుఁ బనికివచ్చును. ఒకపాటి యూఱటను గూడఁ గూర్ప వచ్చును. కాని తన్మయతఁగోలుపు నీ సన్నివేశమునకు అవి పనికిరావు. ఇప్పటి యీతరితీపుతలఁపులు శిశువుల కోసరింతల వంటివి. ఇందులకు పెద్దలు కసరవచ్చుఁగాక. నిక్కముగ వీనికి సమాధానము కలుగదు" అని. అప్పటి మదీయభావమునకు శాస్త్రులవారి సల్లాపము చక్కని యుదాహరణమువోలె నయ్యెను. వెన్నెల మహిమవలన నరువదిపదిదాటిన శాస్త్రుల వారును శిశువుగ మాఱిపోయిరి! కావుననే వారి యీవాక్కు నిక్కముగ బాలభాషితము అనఁగా బ్రహ్మభాషితము!

---

# XI

## కొందఱు వ్యక్తులు.

శాస్త్రులవారు కొందఱు వ్యక్తులతోఁ బొరసియుండిన సంబంధమును వారినిగూర్చి యొసంగిన యభిప్రాయములును శాస్త్రులవారి గుణవిశేషములకు నిదర్శనములు స్వతఃకౌతూహలావహములు అగుటంజేసి నాయెఱుకకొలఁది నిట లిఖించుట యుచితమని తలంతును.

ఒకసాయంతనమున లెప్టనెంటుకర్నల్ (అప్పుడు మేజర్) శంకరశాస్త్రిగారు తమ భవనమున నిజగురువులగు శాస్త్రులవారికి ఉపాహారముల విందొసంగి యందులకు తన మిత్త్రులను సతీర్థ్యులను గొందఱి నాహ్వానించిరి. ఆసమావేశమునఁ దమగురుభక్తి యుట్టిపడునట్టులు డాక్టరుగారు శాస్త్రులవారిని బ్రశంసించుచు "ఎందఱేని పండితకవులు, అధ్యాపకులు గలరు. కాని మాశాస్త్రులవారికి మాగురుపాదులకు మిన్నయని యెన్నఁదగినవారు ఒకఱును లేరు. ఇఁక రాఁబోరు. పాండితియందు ప్రతిభయందు బోధనకౌశలమందు శాస్త్రులవారికి సమానులు శాస్త్రులవారే" అని వచించిరి. శాస్త్రులవా రిట్లు ఉత్తరమొసంగిరి. "ఈడాక్టరు మీకందఱకు 'మేజరు 'అయినను నాకుమాత్ర మెప్పటికిని 'మైనరే'! అంతియ్యే

గాదు. శిశువే యనవచ్చును. ఏలయన అయ్యవారికి శిష్యులు ఎప్పటికిని శిశువులే. శిష్యుల యభ్యుదయమే యొజ్జతనమునకు సాఫల్యము. కావున మన డాక్టరుగారి యభ్యున్నతివలన నేను ధన్యుఁడను. మఱి యీశిశువునకు ఇతోధికప్రాభవము కలుగును గాక యని యాశీర్వదించువాఁడను. ఈనాఁడు ఇచ్చటి మిత్త్రబృందమునం దపరిమితానందభరితుఁడై ప్రధానపాత్రము కాఁదగిన మీనసతీర్థ్యుఁడు నా ప్రియశిష్యుఁడు ఎఱగుడిపాటి వేంకటాచలముపంతులు కేవల స్మరణీయుఁడయ్యెను గదా" అని కంటనీరు పెట్టుకొనిరి. డాక్టరుగారి సతీమణి తమ దివ్యగానముచే నాటి యతిథులకు బ్రహ్మానందముం గొలిపిరి. సమావేశాంతమున శాస్త్రులవారు మెట్లుదిగుచు "ఇదె రవంత స్వర్గసౌఖ్యమును జవిగొని మరల మర్త్యలోకమునకు అవరోహించుచున్నాము" అని నాటకఫక్కిగాఁ బలికిరి.

అప్పుడు ఆంధ్రవిశ్వకళాపరిషదుపాధ్యక్షులు (ఇప్పుడుఁగూడ) డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారి ప్రేరణచే శాస్త్రులవారు "కళాప్రపూర్ణ" బిరుదముతో సత్కరింపఁబడనున్న సమయమున ఆబిరుదు తత్త్వమునుగూర్చి శాస్త్రులవారి మ్రోలఁ గొంత చర్చ జరగెను. పెద్దవారొకరు దాని సామంజస్యమును విమర్శించిరి. ఆబిరుదము సమర్థించుచు శాస్త్రులవా రిట్లు పలికిరి. "అది 'రావుబహద్దరు' వంటి బూటకపు గౌరవము గాదు. ఇంగ్లీషులో 'Master of Arts' అను

బిరుదును 'కళాపూర్ణుఁడు' అని యనువదింతుమేని, 'కళాప్ర పూర్ణుఁడు' 'ప్ర' అను నుపసర్గకలిమిం జేసి 'Doctor of Arts' అనుటకు అనువాదము కానోపును. కావున ఈబిరుదనామము అత్యంతము సాధుప్రయోగమే. మీఁదు మిక్కిలి రెడ్డిగారి యౌచిత్యవివేకమునకుఁ జక్కని లక్ష్యము అనిగూడఁ దలం తును"అని. వారిట్లు నుడువుచుండఁగనే శాస్త్రులవారిని అభినం దించు డాక్టరు సి.ఆర్. రెడ్డిగారి స్వలిఖితము ఒకజాబువచ్చెను. దానిపై విలాసము "Doctor V. Venkataryasastry garu K. P." (డాక్టరు వి. వేంకటరాయశాస్త్రిగారు. కళాప్రపూ ర్ణులు) అని యుండెను. దానిని శాస్త్రులవారు వెంటనే కడమ వారికిఁ జూపి, "దీనిచే నాసమర్థనము సరియగుట రూఢిపడి నది గదా"యని సంతోషించిరి. ఇందలి యోగపద్యమునకును, పై యిరువురు ప్రాజ్ఞుల భావసామ్యమునకును అచ్చెరువయ్యెను.

శాస్త్రులవారు నిజవ్యాఖ్యానసహితను 'ఆముక్తమా ల్యద'కృతిని శ్రీ యెఱ్ఱబ్రోలు రామచంద్రరెడ్డిగారికి సమర్పిం చిన సందర్భమున నొక సమావేశము జరగెను. దానియందు డాక్టరు శంకరశాస్త్రిగారు అగ్రపీఠ మలంకరించి "I shiver in my shoes being called upon to preside on this occasion" ("ఈసమావేశమునందు అధ్యక్షతవహించుటకు నాకు ఆపాదమువణఁకు పొడముచున్నది") అని యుపక్ర మించిరి. ఆ సభాకార్యములోఁ బ్రాముఖ్యమువహించిన శ్రీ

యుతులు బెజవాడ రామచంద్రరెడ్డిగారు అతి నిపుణముగా హృదయంగమముగా శాస్త్రులవారి యార్థికపరిస్థితి, ఋణ భారము, దాని నివారించుటయందు రెడ్డిమహాజనుల బాధ్యత యిత్యాదికముం గూర్చి ముచ్చటించిరి. సమావేశానంతరము శాస్త్రులవారు నాతో "రెడ్డిగారు ఎంత మధురభాషణులు. లౌకికవ్యవహారములలో మునిఁగియుండు వీరికి ఇట్టి వాఙ్మాధురి యెట్లు లభించెనో?" అనిరి. అందులకు నేను "రెడ్డిగారు ఆంధ్రభారతమును పలుమారు పఠించినారనియు దానిలోఁ జాలభాగము వారికి ముఖస్థమే యనియు ప్రతీతిగలదు" అని బదులు పల్కితిని. శాస్త్రులవారు "ఓహో, యిప్పుడు మనస్సునకు వచ్చినది. రెడ్డిగారి యీపలుకు తీపి ఆభారతామృత ప్రసారమే" అని నుడివిరి. దీనినే నేను తరువాత ఈక్రింది పద్యముగా అల్లుకొంటిని.

క. స్తుతమతి యెఱుగనె వ్యవహా
రి తల్లజుఁడు రామచంద్రరెడ్డి పలుకులం
దతిమాధురి? హా! యది భా
రతామృతాస్వాదనమునఁ బ్రాపించినదే.

మఱియొకసమయమున శాస్త్రులవారు కీ॥ శే॥ దొరస్వామి అయ్యంగారినిగూర్చి ముచ్చటించుట తటస్థించెను. అప్పుడు దొరస్వామి అయ్యంగారు సమాజమునుండి చీలిపోయి మఱియొక నాటకసంఘమును నిర్వహించుచుండెను. దానికిఁ దనపరి

తాపమును దెలుపుచు శాస్త్రులవారిట్లనిరి. "ఈదొరస్వామి క్రిస్టియన్ కాలేజిలో నాయొద్దఁ జదువుచుండినపుడు ఆనవమన్మథాకారమును జూచి ఆ యమృతమధురకంఠమును వినినంతనే యతఁడు దుష్యంతుఁడుగా 'శాకుంతలము' ఆడింపవలెనని నాకు అభిలాష వొడమెను. అతనికి అభినయమునందును మిక్కిలి యభిరుచి ప్రతిభ లుండుటఁ గాంచి యెంతయు సంతసించితిని. మఱియు నాయోపినకొలఁది ఆతనిని కడు శ్రద్ధతో దిద్ది తీర్చితిని.ఆయుదంత మాతఁడే మీకుఁ జెప్పఁగలఁడు. ఈసమాజము వారు నన్ను దొరస్వామి పక్షపాతి యందురు. అవుదునుగాక. అది గుణానురాగమేగాని వేఱుగాదు. ఐనను జనులు ఓర్వలేనివారు. కావుననే సమాజమున చీలిక యేర్పడినది. దొరస్వామి తొలఁగి పోయినాఁడు. ఇప్పటికైన మే మిరువురము కలసి మాటాడుకొన్నచో ఈ చిక్కులన్నియు తొలఁగి మరల సమాజ మొకటికాఁగలదని నా నమ్మకము. ఈ సంఘటనమున కెవ్వరును పూనుకొనరే!" అని నిట్టూర్పు పుచ్చిరి.

శాస్త్రిభక్తాగ్రేసరులు శ్రీ గునుపాటి యేనాదిరెడ్డిగారు. వారికిఁ దనకుఁగల సంబంధము శాస్త్రులవారే గ్రంథస్థమొనర్చియున్నారు. వారి లేఖలలో ఇంకను అది రూఢిపడఁగలదు. ఎప్పుడు శాస్త్రులవారిని సందర్శించినను వారికి నిరంతరము ఏనాదిరెడ్డిగారి స్మరణయే. "ఏమండీ, యేనాదిరెడ్డిగారు కనుపడలేదా? ఎపుడు వత్తురు? వారికొఱకు తిన్ను

క్షణము ఎదురుచూచుచున్నాను" అని శాస్త్రులవారు పలుకని దినము లేదు. అప్పుడు శాస్త్రులవారు ఋణభారమునఁ గ్రుంగు చుండఁగా ఏనాదిరెడ్డిగారు దాని నివర్తిలఁజేయుటకుఁ గంక ణముగట్టికొని విశ్వప్రయత్నము గావించుచుండిరి. అట్టితఱి శాస్త్రులవా రొకనాఁడు నాతో నిట్లనిరి. "అయ్యా, ఆయేనాది రెడ్డిగారిని ప్రతిదినము వేఱుపనిలేకున్నను ఒకమారు క్రొత్తూ రునుండి వచ్చి నాకుఁ గనుపడి పొమ్మని చెప్పలేరా? వారి యుద్యమ మింకను కొనసాగకున్నను వారిని జూచునంతసేపు నాకు నాయప్పు తీఱినట్లే తోఁచును, ధైర్యముఁ వొడమును. వారు కనుమఱుఁగైనవెంటనే దిగులు మరలఁ బైకొనును. 'దొడ్డిఁ బెట్టినవేల్పుగిడ్డి కాపు' అను మనుచరిత్రవర్ణనము ఈయేనాదిరెడ్డిగారి కెంతయుఁ జెల్లును. వీరే నాఋణవిముక్తికి తారకము కాఁగలరని నాకు గట్టినమ్మిక" అని. శాస్త్రులవారి యీవాక్కు ఫలించి యేనాదిరెడ్డిగారి కృషిచేతను ఉదార ప్రభువుల విరాళములచేతను శాస్త్రులవారి యప్పుతీఱి వారు పరమపదించుటకు మున్ను వారి చిత్తమునకు ఊఱటయు శాంతియు చేకూరినయుదంతము లోకవిదితమే.;

---

# XII

## లే ఖ లు.

శాస్త్రులవారి జీవితచరమదశలో వారికి నాకు నడుమఁ బలుమారు జాబులు జవాబులు నడుచుట సంభవించెను. వానిలో సుమారు ఏఁబదిలేఖలు శాస్త్రిగారువ్రాసినవి యిప్ప టికిని నాయొద్ద నిలిచియున్నవి. ఈ లేఖలన్నియు ఆంగ్లము నందే రచింపఁబడి శాస్త్రులవారి యాంగ్లభాషావైదుష్యమును అద్భుతశైలిని ప్రదర్శించుచున్నవి. ఇందునకు ఈక్రిందఁ బొందుపఱిచిన ప్రతిలేఖాభాగమును నిదర్శనమే. కావున నిక్కడ ఒక్క వాక్యముమాత్ర ముదాహరించెదను.

" Collapsing of the house, two months' life as a guest, trip under a heavy shower, severance from my better half,.......rejoining the children, young children longing for me to see me, greet me, roll in my lap, a sister eagerly expecting me–in concatenation, appeared as a transition to a new state of existence. " (ఇల్లు కూలఁబడుట, రెండునెలలుగా అతిథి జీవితము, కుంభవర్షములోఁ బ్రయాణము, అర్ధాంగినుండి వీడ్పాటు,......బిడ్డలను గలసికొనుట, చిన్నబిడ్డలు నన్నుఁ జూచుటకు, నన్ను ఆహ్వానించుటకు, నాయొడిలోఁ బొరలు

టకు ఉవ్విళులూరుచుండుట, సహోదరి యుత్కంఠతో నన్ను నిరీక్షించుట—ఇదియెల్ల గోలుసువరుసను ఒకనూతన జీవ ప్రపంచమునకు మాఱుటగాఁ దోఁచెను.) [తే 17-11-27 ది లేఖనుండి]

నిక్కముగ లేఖారచనము ఒక్కకళయే. కేవలవ్యాపారసంబంధమగు జాబులు ఇందులోఁ జేరవు. స్వాభావిక భాషలో సుకుమారశైలిలో హృదయంగమముగ రసవంతముగ లేఖల రచింపఁగలుగుట జన్మతఃకావలయునేగాని కేవల పాండిత్యవలన లభింపదు. నిష్కాపట్యము, రసికత్వము, ప్రేమార్ద్రహృదయము, మనసుగలసిన మైత్రి, సంపూర్ణసహానుభూతి ఇత్యాది సుగుణము లున్నచోటనే లేఖాశిల్పమలవడును. లేఖ యనఁగా ఒకవ్యాసముగాదు. ఉపన్యాసమును గాదు. మిత్రుఁలేని ప్రియులేని ముఖాముఖి ముచ్చటించుకొనుట వంటిది. లిఖితుఁడు ప్రత్యక్షముగ ఎదుట నున్నట్లే భావన. వాక్కునకు బదులు వ్రాఁత. ఇంతియ భేదము. సంభాషణలో వలెనే లేఖవ్రాయునప్పుడును భావ సద్యస్స్ఫూర్తి యుండవలయును. మఱియు భావశబలతయెల్ల లేఖలోఁ బ్రతిఫలింపవలెను. శాస్త్రులవారి లేఖలు అట్టివే యైయుండెను. ఒకటి రెండు తప్ప కడమలేఖలెల్ల వారు స్వదస్తూరిలో వ్రాసినవే. ఏంతక్లేశమేని సహించి స్వదస్తూరిలో వ్రాయనిది వారికి తృప్తిలేదు. ఇందుల కుదాహృతి: "You may know from my awkward hand how I am tottering under the

weight of old age." (నా గజిబిజి వ్రాఁతవలన జరాభార ముచే నే నెట్లు తడఁబడుచున్నదియు నీవు గ్రహింపవచ్చును.) [27-6-27.] "Straining my eyes very painfully, I have penned these lines." (కనుల నెంతయో క్లేశపఱుచుచు ఈపంక్తులు వ్రాసినాఁడను.) [6-7-26.] "I follow these lines very closely while writing them, or else I cannot write at all........Each letter I write is an uphill work. I hope therefore that you will excuse my silence." (ఈ పంక్తులను వ్రాయునప్పుడు మిక్కిలి దగ్గఱగాఁ గలుపుకొనుచున్నాను. లేనియెడ వ్రాయనేలేను... నేను వ్రాయు ప్రతి జాబును పర్వతారోహణము వంటిది. కావున నేను ఊరకున్నందులకు క్షమింపఁగోరెదను.) [6-8-28.]

శాస్త్రులవారి జాబు చదువునప్పుడు వారి మూర్తి సాక్షాత్కరింపవలసినదే. వారి లేఖను బఠించుటనఁగా వారి గోష్ఠియే. వారి లేఖలో అధికభాగము ప్రాయికముగా Poste Scripts (ముగింపువెనుక వ్రాఁతల) తో నిండియుండును. ఒక్కొక్కప్పు డవి అసలుజాబు కన్నను విలువగలిగి మనోహర ములై యుండును. ముందువెనుక ఆలోచన యేమియులేక తోఁచినది తోఁచినట్లు వెంటనే వ్రాసివేయుట యీ లేఖారచనకు ముఖ్యలక్షణము. ఇందుల కించుక యుదాహృతి. ఒక జాబు P. S. (ముగింపువెనుకవ్రాఁత) యిట్లున్నది: "I sent copies

of 'అలంకార'......for such friends as yourself. See I have grown a young man again!" (నీకును ఇతర మిత్రులకును 'అలంకార సంగ్రహము' ప్రతులను బంపినాను నేను తిరిగి యువకుడనైతిని జూడుము!) [1-6-27]. మఱియొక లేఖలో ఇట్లున్నది. "What is this? Dream? What is dream? How happy was Bhishma who could breathe his last at will! Why attachment to this delirium? The heart feels pain at this puzzle. The only desirable thing in life is to spend time with friends wise, learned and goodnatured. Sleep-what is it? Dream-what is it? Pain and pleasure-what are they? Why are they? My dear friend, I am turning mad......" (ఇదియేమి? కలయా? కలయన నేమి? స్వచ్ఛందమరణశక్తి గలిగిన భీష్ముఁ డెంతటి సుఖి! ఈ కలవరింతపై మమకార మెందులకు? ఈ సమస్యను గుఱించి హృదయము వ్యథనొందుచున్నది. జీవితములోఁ గోరఁదగినది బుద్ధిమంతులు విజ్ఞానులు సుస్వభావులు అగు మిత్రులతోడి కాలక్షేపమొకటియే. నిద్రయనఁగా నేమి? కలయనఁగా నేమి? సుఖదుఃఖములు అనఁగా నేమి? అవి యెందులకు? నా ప్రియ మిత్రమా, నాకుఁ బిచ్చియెత్తుచున్నది...) [17-11-27].

శాస్త్రులవారి మిత్రప్రీతియు, శిష్యవాత్సల్యమును, ఇష్టగోష్ఠీప్రియత్వమును అతిలోకమైనవి. వానికి ఈ లేఖలందు అసంఖ్యాకములగు నిదర్శనములు గలవు. ఇంచుక యుదా

హ్యాతి: "I pray that the Almighty will save me for return to you." (నిన్ను మరలఁ గలిసికొనుటకై యీశ్వరుఁడు నన్నుఁ గాపాడునుగాక యని ప్రార్థించెదను.) [4-10-25]. "May god not distance the day on which we sit together and converse next." (ఈసారి మనము కలసి ముచ్చటించుకొను దినము భగవంతుఁడు దూరము చేయకుండునుగాక.) [1-1-26]. "I miss my happy evenings in Nellore in the company of friends like you." (నెల్లూరిలో నీ బోటి మిత్రులసాంగత్యము గలిగిన యస్మదీయసాయంసమయగోష్ఠు లిచ్చట లేమికి వగచెదను ) [19-12-26]. "It is very hot here; but yet I am longing to go to Nellore to see you." (ఇచ్చటనే చాల వేండ్రముగ నున్నది. కాని నిన్నుఁ జూచుటకై నెల్లూరుపోవ నభిలషించుచున్నాఁడను.) [3-5-27]. "I think my health may brighten up if I spend a month or so with my friends." (నేను సుమారు నెలదినములు నామిత్రులతోఁ గడపునెడల, నాయారోగ్యము బాగవునని తలంచెదను.) [6-6-27]. "I am yearning to have a sight of my friends.........An old man's desire to see his young friends must be excused". (నేను నామిత్రుల సందర్శనమున కువ్విళులూరుచున్నాను.....వృద్ధునకుఁ దన యువమిత్రులను జూడవలయునను కోరిక క్షంతవ్యము. [27-6-27]. "I have penned these lines to relieve

myself from despondency by dwelling on the memory of your kind countenance. Let me have a few friends to sympathise with me. That will be enough." (నీ సదయవదనమును స్మృతిపథమున నిలిపికొని నిరుత్సాహస్థితిఁ దలఁగి యూరటఁ గనుటకై యిక్కట్టులు ప్రాపించిన నాయెడ సహానుభూతి గల కొలఁదిమిత్రులు నాకు ఉండనిమ్ము. అదియే చాలును) [12-7-27]. "Sorry to be away here," (దూరమున నిచ్చట నుండుటకుఁ జింతిల్లు చున్నాను.) [6-8-28]. "I am very ill---I shall be happy to be in your midst......I am sorry I am but a few days only to live in your midst." (నేను చాల జబ్బుగా నున్నాను.........నాకు మీనడుమనుండుట సుఖముగా నుండును......మీసహవాసము నికఁ గొలఁదిదినములు మాత్రమే అనుభవింపఁగలుగుదునని చింతిల్లుచున్నాను) [14-12-28]. "May God give me that measure of life to spend some more time in the company of N. R., yourself etc." (నే.రా., నీవు మున్నగు వారి కూటమిలో ఇంకను గొంతకాలముఁ గడపుటకు వలయు జీవితపరిమాణ మును భగవంతుఁడు నాకుఁ బ్రసాదించుఁగాక.) [15-12-28]. "I do not know what poor chances Destiny has in store for me to enjoy the company of my Nellore friends." (నా నెల్లూరు మిత్రుల సహవాసమును అనుభవించుటకు నాకు దైవము ఏపాటి స్వల్పావకాశముల నింకను

సంకల్పించియున్నదో నే నెఱుంగను.) [18-1-29]. "Whatever may become of me, may the Almighty preserve my friends in happiness." (నాకేమైనను సరియే. పరమేశ్వరుఁడు నామిత్రులను సౌఖ్యమొసఁగి కాపాడునుగాక.) [6-6-27]. "I like to own that house, for it gives me an opportunity of short evening-gossips with my only few real and sincere friends" (నేను ఆయింటిని నిలుపుకొనఁగోరెదను. ఏలయనఁగా, నాకుఁగల కొలఁది మంది నిక్కపు మంచి మిత్రులతో సాయంసమయ సల్లాపములకు అది యవకాశమొసంగును.) [28-8-27]. శాస్త్రులవారి స్నేహాతిశయము ఇంచుక కాలవిలంబమును గూడ నోర్వనిది. ఒకమాఱు నేను జాబువ్రాయుట కాలసింపఁగా నాకు వచ్చిన లేఖలో నిట్లుండెను. "Have I in any way in my prolonged sufferings, disappointments and miseries, offended or annoyed you, so that I seldom hear from you of late?" (నాదీర్ఘక్లేశములందు, ఆశాభంగములందు, ఇడుమలందు ఏవిధముగానైన నీకుఁ దప్పొనర్చి గాని మనసు నొప్పించిగాని యున్నానా? ఏలన, ఇటీవల నీ యొద్ద నుండి జబు వచ్చుటలేదే?) [6-7-26].

సత్సాంగత్యమే సజ్జనగోష్ఠియే యిహలోకస్వర్గమని శాస్త్రులవారి నిశ్చితాభిప్రాయము. ఇది పూర్వోద్ధామ్నాత

మయినది. ఇచ్చుటను ఇంపుకై యుదాహృతి. "The only Heaven real in creation is the company of the wise." (సృష్టిలో నిక్కమగు స్వర్గము సత్సాంగత్య మొక్కటియే) [22-11-27].

శాస్త్రులవారి శిష్యవాత్సల్య మపారమనుటకు మఱియు నిదర్శనము. సతీర్థ్యులు శ్రీ ఓరుగంటి వేంకటేశ్వరులు కాశీకి వెళ్లి చదువ నున్నారని నేను తెలుపఁగా శాస్త్రులవారిట్లు బదులు వ్రాసిరి. "You wrote to me that Chi. Venkateswarulu would be going soon to Kasi. I am glad that he will return a great Sanskrit scholar. He should meanwhile be so good as to be going to Nellore constantly and give us the happiness of his company from time to time...... May God bless him with long life and prosperity." (చి॥ వేంకటేశ్వరులు త్వరలో కాశీకిఁ బోవ నున్నాఁడని వ్రాసినావు. అతఁడు గొప్ప సంస్కృత విద్వాంసుఁడై తిరిగి రాఁగలఁడని సంతసించుచున్నాను. ఈమధ్యకాలములో అతఁడు అప్పుడప్పుడు నెల్లూరికి వచ్చి యాతనితోడి కూటమివలని సౌఖ్యమును మన కొసంగుచుండవలెను....భగవంతుఁ డతనికి దీర్ఘాయుశ్శ్రేయస్సులం బ్రసాదించుఁగాక.) [25-6-27]. ఒకప్పుడు శాస్త్రులవారు కోరిన యొక చిన్నపనిని నేను చేసిపెట్టఁగా వారు నా కిట్లు వ్రాసిరి.

"దైవే తీర్థే ద్విజే చైవ దైవజ్ఞే భేషజే గురౌ,
యాదృశీ భావనాయత్ర తాదృశీ సిద్ధిరిష్యతే.

You addressed me as గురు. So devoted was your heart.......that your endeavour succeeded to your own surprise. I am proud that I have such students." (నీవు నన్ను 'గురూ' అని సంబోధించితివి నీ హృదయము అంత భక్తియుక్తమగుటచేతనే నీ ప్రయత్నము నీకే ఆశ్చర్యము కలుగు తీఱున ఫలించినది. ఇట్టి శిష్యులఁ బడసినందులకు నే నుప్పొంగుచున్నాను.) [9-4-27.] ఇదియు వారి శిష్యవాత్సల్యమునకు నిదర్శనమే.

శాస్త్రులవారు అదృష్టజాతకులు గారు. వారి జీవితమంతయు పలుతెఱఁగులగు పెక్కు చిక్కుట్టులతో నిండియుండెను. వారే యిట్లు వ్రాసినారు. "Continued conspiracy has been engineered against me by దుష్టదైవము." (దుష్టదైవము నాకుఁ బ్రతికూలమగునట్లు నిరంతరము కుట్ర సలిపినది.) [6-6-27]. కాని వారికి భగవంతునియెడఁగల యనన్యభక్తి యెప్పుడును సడలినది గాదు. భాగవతములో గజేంద్రుని పగిది శాస్త్రులవారును పలుమారు

"నీవే తప్ప నితఃపరం బెఱుఁగ; మన్నింపందగుఁ దీనునిఁ,
రావే యీశ్వర, కావవే వరద, సంరక్షించు భద్రాత్మకా,"

యని ప్రార్థించువారు. ఇందుల కుదాహృతి: "The Almighty has not shown Grace yet. Meanwile I am sinking, hoping that He will show it at any moment." (పరమేశ్వరుఁ డింకను అనుగ్రహముఁ జూపలేదు. ఈ లోపుగ నేను క్రుంగుచు ఏక్షణములోనైనను దేవుఁడు నన్నుఁ గరుణించు ననునమ్మికతో నున్నాను.) [12-10-25]. "Perhaps God will now tear off the miserable page of my biography. He has concluded it perhaps." (బహుశః దేవుఁడు నాజీవితచరిత్రలోని యిడుములపుటను ఇంతటితోఁ జింపివేయవచ్చును. ఆతఁడు దానిని ఉపసంహరించినాఁడు కాఁబోలు.) [13-4-26]. "ఆముక్తమాల్యద" అచ్చు పూర్తి యగుటకు ఇంచుక ధనలోపముగా నున్నదని యొకసారి శాస్త్రులవారు నాకిట్లు వ్రాసినారు: "I am not able to mow my ripe field but for want of a few sickles." (కొద్దిసంఖ్య కొడవళ్లు తక్కువపడినందున నా పండినపొలము పైరుఁ గోసికొనఁ జాలకున్నాను.) [4-4-27]. కాని పై యంచనాలో శాస్త్రులవారు పొరఁబడినట్లు తెలుపుచు ఇట్లు వ్రాసినారు. "Inscrutable are the ways of Providence···I thought only 2 formes remained whereas 6 formes have still to be printed......Mr. Vavilla Venkateswara Sastry is printing them giving me my own time for paying the charges. God is helping me in such mysterious ways." (దురవగాహములుగదా దైవ

మార్గములు... నేను 'ఆముక్త'లో 2 ఫారములే కోఱవ యనుకొంటిని గాని 6 ఫారము లింకను అచ్చుగావలెను.... శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు ముద్రణవ్యయముఁ జెల్లించుటకు నాకు వలసినంత వ్యవధినొసంగి వానిని అచ్చొత్తించుచున్నారు. దేవుఁ డిట్టి నిగూఢమార్గముల నా కుపకరించుచున్నాఁడు.) [12-7-27]. " Do not be sorry for me, for it is of no use to be so. Once desperate, desperate ever. If man cannot rescue man, God can. Man got me into this scrape. I appeal to God. " (నా కొఱకై చింతింపవలదు. ఏలయన అది నిష్ప్రయోజనము. ఒకమారు మునిఁగిన పిమ్మట ఎంత లోతైన నేమి ? మానవుఁడు కాపాడలేఁడేని దేవుఁడు కాపాడఁగలఁడు. మానవుఁడు నన్నీ కూపమునఁ ద్రోసినాఁడు. నేను దేవునిఁ గూర్చి వేడుకొనుచున్నాను.) [22-3-28]. "I seek of you the favour of a kind prayer addressed to the Almighty for my relief. " (నేను నీయొద్దనుండి యొక యుపకారముఁ గోరెదను. అదేమన మదీయకష్ట నివారణకొఱకుఁ బరమేశ్వరునిఁ బ్రార్థించుటయే) [15-12-28].

శాస్త్రులవారు ధర్మైకతత్పరులు. ఒక లేఖలో నిట్లు వ్రాసినారు. "Disinterested friends......are rare. A life as dear to you as self may not be worth a pie to another man. But all bend alike to the

scythe of time. Nothing earned here accompanies to Heaven except ధర్మ." (స్వార్థరహితులగు మిత్రులు అరుదుగా నున్నారు. నీకు ఆత్మతో సమానప్రియమగు నొక జీవితము మఱియొకనికి దమ్మిడీ విలువచేయఁబోవచ్చును కాని యందఱును కాలకరవాలమునకు మెడ పంచవలసినవారే. ఇచ్చట గడించినదేదియు పరలోకమునకుఁ దోడై రాదు ధర్మ మొక్కటి తప్ప.) [1-1-20]

శాస్త్రిగారు స్వాతంత్ర్యప్రియులుగూడ. కావున వారికి ముదిమిని పాపుకించిన లేవడి దుస్సహమయ్యెను. స్వార్జనచేఁ గుటుంబమును బోషించుటకుఁ దగిన వయస్సు గాదు. పరార్జనపై నాధారపడుటకు మనస్సు రాదు. ఈద్వైవిధీభావమునందు వారు పడిన పరితాపము నొక జాబులో నిట్లు తెలిపినారు. "Now the worst hardship of man has caught hold of me. It is no other than utter indigence......Alas! my Destiny! When am I to live peacefully upon my own 'charu' and rice?... Such is the fortune of your......Kalaprapurna." (ఇప్పుడు మానవుని యధమక్లేశము నన్నుఁ బట్టినది. అది మఱేమియుఁ గాదు శుష్కదారిద్ర్యమే...అక్కటా! దుర్విధి విలసితము! నేను నాచారు అన్నము తిని కుదురుగా జీవింపఁ గలుగుట యెన్నటికో?......ఇట్లున్నది మా...కళాప్రపూర్ణునీ భాగధేయము.) [14-7-23]. ఇట్టిదే మఱియొక లేఖ

తే 15-12-28 దిన వ్రాసి నేను అపార్థము చేసికొందునేమో యని కొంబోలు దానికి మకుటముగా "The following is no appeal. Be so kind as not to take it as such." (ఈక్రింద వ్రాసినది యాచ్నార్థము గాదు. దయచేసి యట్టిదిగా గ్రహింపవలదు) అని చేర్చినారు. అట్టిది వారి స్వాతంత్ర్యప్రియత్వము !

పేదఱికమునకుఁ దోడు దైవికముగా మున్పునఁ బట్టిన యప్పుల వెనుభూతము శాస్త్రిగారిని ఘోరార్తి పాలొనర్చెను. ఈహృదయావేదన పెక్కు లేఖలలో పొంగి పొరలుచున్నది. ఇంచుక యుదాహృతి: "No sleep. Creditors are haunting my sleep···Please excuse the pain I am giving you by this piece of information." (నిద్ర లేదు. అప్పులవారి దృశ్యము కునుకుపాటు నాక్రమించుచున్నది......ఈవార్తచే నీకుఁ గలిగించు సంతాపమునకు క్షమింపఁగోరెదను.) [15-2-26] పై యుత్తరార్ధమున శాస్త్రుల వారి హృదయసౌకుమార్యము తేటతెల్లము గదా. "If I am rid of debts anyhow I may get on till my fingers touch the bottom of my purse." (ఏవిధముగ నైన ఋణవిముక్తుఁడ నగుదునేని సంచి యడుగు వ్రేళులకుఁ దగులు వఱకెట్లో కాలముఁ గడపఁగలను.) [28-8-27]. "The debt is a wound in my heart." (ఋణము నాహృదయములో వ్రణమై యున్నది.) [29-1-28]. "When will the night-

mare of loan cease to visit me?" (ఋణమను పెను భూతము నన్నుఁ బీడించుటను మానుట యెన్నటికో?) [15-12-23]. గురు ఋణముఁ దీర్చుటకై కంకణముఁ గట్టుకొని గట్టి జతనముఁ జల్పి యెంతక్లేశమేని సహించి సఫలీకృత సంకల్పులైన శ్రీ గునుపాటి యేనాదిరెడ్డిగారిపట్ల శాస్త్రులవారి కృతజ్ఞత యెంత గాఢమో పూర్వప్రకరణములోఁ దెలుపఁబడినది. ఇది శాస్త్రిగారి యనేక లేఖలలోఁ బ్రకటమగుచున్నది. "Mr. Yenadi Reddy writes that he will clear my loan on the 15th December. I should consider myself very fortunate if I live till that day to know the event." (యేనాదిరెడ్డిగారు నా యప్పును డిసెంబరు 15-వ తేది నాఁడు తీర్చెదనని వ్రాసినారు ఆఫలితార్థముఁ దెలియుటకై నేను ఆనాటివఱకు జీవింతునేని మిక్కిలి యదృష్టవంతుఁడనని భావింపవలయును.) [29-11-38]. "Mr. Yenadi Reddy is worrying himself for my sake, night and day...He has taken no end of trouble...for my sake.......My only saviour is Mr. Yenadi Reddy. Removal of loan will be my salvation." (యేనాదిరెడ్డిగారు నాకొఱకై రేయింబవలు సంకటపడుచున్నారు...నాకొఱకు వారు పడిన క్లేశమునకు మేరయే లేదు...నామోక్షప్రదాతలు యేనాదిరెడ్డిగారే. ఋణనివృత్తియే నామోక్షము) [15-12-28.]

లోకోత్తర ప్రజ్ఞాధురీణుఁడు ప్రభుకార్య నిర్వాహాదురంధరుఁడగు యుగంధరపాత్రను సృష్టించినవారయ్యు శాస్త్రులవారు అమాయకశీలురు నిష్కపటులు అగుటచేఁ బలుమారు వంచకుల మాయమాటలకు బేలుపోయి చేతిసొత్తును గోలుపోవుచుండిరి. దీనిని గూర్చి వారే యొక జాబులో నిట్లు వ్రాసినారు. " Whenever an ambitious impostor came across my way, I have had to take a defeat in this life. As yet there is no consolation. " (ఆసగొన్న వంచకుఁడు నా కెదురుపడినపుడెల్ల నే నీ జీవితములో అపజయమునే పొందవలసి వచ్చినది. ఇంతవఱకు దీని కూఱట కలుగ లేదు.) [11-8-27].

శాస్త్రులవారు సలిపిన సారస్వతకృషియెల్ల వాగ్దేవికి వరివస్యగా భావించి పారమార్థికదృష్టితోఁ గావించినారు. "ఆముక్తమాల్యద" వ్యాఖ్యానము చూడికుడుత్తదేవికి సేవ.

"చేసెద నింకఁ దత్పరత సేవలు చూడికుడుత్తదేవికిన్."

అనినారు గదా. ఈ భావమునే యొక లేఖలో వ్రాసినారు. " Will the Mother Choodikudutha accept and appreciate my service ?" (చూడికుడుత్తాంబ నాకైంకర్యమును గ్రహించి యామోదించునా?) [28-8-27].

ఆంగ్లకవి మిల్టనువలె సంస్కృతకవి భవభూతివలె శాస్త్రులవారును స్వప్రతిభయందు సంపూర్ణవిశ్వాసము గలిగి

యుండిరి. ఇందులకు వారి వ్రాతలే సాక్ష్యము. "I am sure of one thing. There will be a great commotion in the Telugu world at the sight of the Introduction to my 'Amukta.' I am eager to observe that commotion and to surprise my friends with it." (ఒక్కదానిఁ గూర్చి నాకు నిస్సందేహము. నా 'యాముక్త' పీఠికను జూచినతోడనే తెలుఁగు ప్రపంచములో నొక పెద్ద కల్లోలము పుట్టును. దానిని వీక్షించుటకును దానిచే నామిత్రులకు విస్మయమొదవించుటకు నేను కుతూహలపడుచున్నాను.) [27-6-27]. "The following are my few literary works that may take my name to posterity :—My dramas [' Sakuntalam ', ' Malavika', ' Ratna ', ' Priya ', ' Usha ', ' Pratap ', ' Bobbili ', 'Uttara ', ' Vikrama ' etc.], ' Naishadha ', ' Amukta, ' ' Hitopadesa champu, ' ' Alankara ', ' Dasa '. After all, these are only a few." (ఈక్రింది సారస్వతగ్రంథములు నాపేరును భావికాలము వారల కందియ్యవచ్చును:- నా నాటకములు ['శాకుంతలము', 'మాళవిక', 'రత్న', 'ప్రియ', 'ఉష', 'ప్రతాప', 'బొబ్బిలి', 'ఉత్తర', 'విక్రమ' మున్నగునవి], 'నైషధము', 'ఆముక్త', 'హితోపదేశచంపువు', 'అలంకార', 'దశ'. ఇవన్నియుఁ గలసి స్వల్పసంఖ్యాకము లే.) [28-3-27].

ఒకజాబులో శాస్త్రులవా రిట్లు వ్రాసిరి: "God 's ways are inscrutable. 'Hithopadesa' will be my last perhaps". (భగవన్మార్గములు దురవగాహములు. 'హితోప దేశమే' నా కడపటి కృతి యగును గాఁబోలు) [27-6-27]. అది యట్లే యైనది మహనీయుల వాక్కు రిత్తపోవునా!

పెద్దవా రొకరు శాస్త్రిగారి "విజయవిలాస" వ్యాఖ్యా నమును విమర్శించుచు రెం డుపన్యాసము లొసంగిరి. వానిని గుఱించి శాస్త్రులవా రొక లేఖలో ఇట్లు వ్రాసిరి: "Are Mr. D-'s attacks on my commentary of 'Vijaya Vilasamu' sound? If they are correct, and the errors due to my ignorance or oversight, I must own them as such. Otherwise the gentleman must be approached with my apology." (నా'విజయవిలాస' వ్యాఖ్యానముపై శ్రీ ధ—గారి యాక్షేపణలు సాధువు లేనా? అవి సమంజసమై, తప్పులు నా యెఱుఁగమి కతముననో పొరఁబాటు చేతనో దొరలియుండినయెడల వానిని తప్పులుగా నే నొప్పుకొనవలెను. అట్లు గానిచో ఆమహాశయునకు నా క్షమార్పణ నందియ్యవలెను) [9-4-27]. దీనినిబట్టి శాస్త్రుల వారి నిరహంకృతియు, సత్యనిరతియు, మాట నాజూకును దేట తెల్ల మగుచున్నవి.

అంతటి పండితులయ్యు శాస్త్రులవారు ఏవిషయము నందుఁగాని కేవలము శాస్త్రపుముక్కల నేకరువు పెట్టుటతోఁ

దనివి చెందక, దేశకాలపరిస్థితుల గుఱ్తించిన స్వానుభవజ్ఞాన మునే యుపదేశించుచుండువారు. ఇందుల కొక్క యుదాహరణము. "In this world of puzzle, where the future is never known, why regret anything and rejoice in anything? Mutual robbery is the rule of the day; Bhavabhuthi said 'the happiness of social life among relations, friends, favourites etc, is generally unsteady as the flash of lightning.' 'ప్రాయేణ బాన్ధవ సుహృత్ప్రియ సంగమాది సౌదామని స్ఫురణచఞ్చలమేవ సౌఖ్యమ్.'" (జరుగఁబోవునది యెప్పుడును దెలియని యీ దురవగాహప్రపంచములో, దేనికేని అను తపించు టేల? ఆనందించు టేల? పరస్పరాపహరణమే యిదా నీంతన విధానమైనది. భవభూతి చెప్పినాఁడు గదా. "ప్రాయిక ముగా బంధుమిత్రప్రియాదుల సంగమమువలని సౌఖ్యము మెఱపు మెఱయుటవలె చంచలమే" యని) [23-8-27].

నే నొకప్పుడు కడిఁది యిడుమలలోఁ జిక్కి స్రుక్కుచు నాదుస్స్థితిని శాస్త్రులవారికిఁ దెలుపుకొనఁగా వారు నాకు లిఖించిన ప్రత్యుత్తరములోఁ బూర్వోక్తసుగుణములు చాల వఱకుఁ బ్రతిఫలించుచున్నవి. కావున దాని నిట విపులముగ నుదాహరించి గ్రంథవిస్తరభీతిచే ఈప్రకరణము నింతటితో నుపసంహరించెదను.

"My dear S—,

Your kind p. c. of 21st. I am very sorry to learn therefrom the troubles in which you are

placed by circumstances. My heart melted to peruse it........I pray to the Almighty to embolden you so as to bear all the present unhappiness and to change your circumstances into the most happy condition.......I know you are always rightminded ....God will reward you for your good-nature. You will remember how enlivening your company was to me during my stay in the Tobacco Garden. The constant reminding every day, every evening, that you should go to me even during those unhappy cyclonic days is ample proof of the relief which I always derived from your company. I shall not miss any opportunity which God would give me, of spending time at Nellore in order to spend some hours daily with you. Meanwhile I pray to Him for better health to all of us......you do not belong to the modern class of gentlemen... From your card I see that your heart was not peaceful when you penned it......But I cannot help except praying to him for mending our condition. Goodnatured men are seldom happy. Try to realise the following :—

'సన్త స్సచ్చరితోదయవ్యసనినః ప్రాదుర్భవద్యన్త్రణాః
సర్వత్రైవ పరాపవాద చకితాః జీవన్తి దుఃఖం సదా॥

అవ్యుత్పన్నమతిః కృతే న సతా నైవాసతా వ్యాకులో
యుక్తాయుక్తవివేకశూన్యహృదయో ధన్యోఽపినఃప్రాకృతః'

'The good-natured men ever anxious to walk in the path of virtue and afraid of the censure pronounced by others are always unhappy. The uncultured man who makes no difference between right and wrong in his own conduct and is seldom disturbed by his own conscience-that fool is the happy man.'

We poor mortals have no control over anything. It is merely the fashion to say that we should rise above our circumstances, but it is quite impossible to do so. Please allow me to say that this world is really 'the vale of tears.' Right or wrong, virtuous or sinful, kind or cruel have no meaning. But the punishment or reward is in the deed, character and conduct, and the mental state itself. The only heaven real in creation is the company of the wise......We can philosophise when the trouble is over, but cannot prevent it by forethought. After all, our poor existence is not worth the wisdom that is preached to live happily. After all, Nature asserts itself thrusting precept-aside.

I may go to Bezwada on the 2nd or 3rd December, and if all goes well, halt at Nellore to feast my eyes and heart with a short company of my friends......The days are growing less chill here.

I am sorry that I have but a short time to live, for the company of friends so wise, so loving ......is a very powerful tie to a simple heart like mine. Nothing can be a greater misfortune than death, for it deprives man of this best treasure. Hoping that this finds you and yours in perfect health and peace,

Yours sincerely,
V. VENKATARAYA SASTRY."

(నా ప్రియసు—,

21-వ తేదిన నీవు దయతోఁ వ్రాసిన లేఖ యందినది. దానిఁ జదివి నీకిప్పుడు తటస్థించిన యిడుమలను దెలిసికొని మిక్కిలి చింతిల్లుచున్నాను. దానిని జేదువఁగా నాహృదయము కరఁగినది...ఇప్పటి నీ కష్టముల భరింపఁగల ధైర్యమును నీకుఁ బ్రసాదించుటకును నీపరిస్థితులను అత్యంత సుఖవంతములుగా మార్చుటకును భగవంతునిఁ బ్రార్థింతును......నీవెల్లప్పుడును సాధుమనస్కుఁడవని నాకుఁ దెలియును...భగవంతుఁడు నీకు నీ సౌజన్యమునకుఁ దగిన ప్రతిఫలము నొసం

గాను. నేను 'పొగాకుతోట'లో నుండిన దినములలో నీ సంగమము నాకెంత వేడుకగా నుండెనో స్మరింపుము. ఇక్కడివాని వచ్చిన పెద్దదినములలోఁ గూడ నీవు నన్నుఁ గలసికొనవలయునని ప్రతిదినము, ప్రతిసాయంతనము జ్ఞప్తిచేయుచుంటివే అదియే ప్రబలసాక్ష్యము. నీ గోష్ఠివలన నేను పొందుచుండిన యూఱటను. నిత్యము నీతోడఁ గొన్నిగంటలు గడుపుటకై భగవంతుఁడు నాకు నెల్లూరిలోనుండుట కొసంగు నవకాశము నెన్నడును జాఱవిడువను. ఊరడుము, మన యందఱి స్వారోగ్యాభివృద్ధికై దేవునిఁ బ్రార్థించెదను. నీ జాబునుబట్టి నీవు దానిని వ్రాసినప్పుడు నీహృదయము శాంతముగా లేదని గ్రహించినాఁడను. కాని మనస్థితిని సవరింపుమని భగవంతుని బ్రార్థించుట తప్ప, నీ కెట్లును దోడ్పడఁజాలను. మంచివారు సుఖముగానుండుట అరుదు. ఈ క్రింది భావమును జక్కఁగా గ్రహింపుము.

'ఎల్లప్పుడు సన్మార్గముననే నడచుటకు జాగరూకత వహించి పరాపవాదమునకు వెఱచు సజ్జనులెందఱును దుఃఖజీవులే. విద్యాహీనుఁడును దన నడవడిలో మంచిచెడ్డల వివక్ష లేనివాఁడును యుక్తాయుక్తవివేకశూన్యుఁడును అగు ప్రాకృతుఁడే ధన్యుఁడు.'

అల్పప్రకృతులము మానవమాత్రులమగు మనము దేని విడఁదను అధికారము లేదు. మనము మనస్థితిగతులకు అతీతు

లము గావలయు ననుట పరిపాటియే. కాని యట్లగుట యెం
తయు అసాధ్యము. ఈప్రపంచము నిక్కముగా 'కన్నీళ్లకోన'
యే. మంచి చెడ్డ, పుణ్యము పాపము, ఉదారము క్రూరము -
అను మాటలకు అర్థము లేదు. కాని శిక్షయో బహు
మానమో పనియందే, శీలమందే, నడవడియందే, మానస స్థితి
యందే నెలకొనియున్నది. సృష్టిలో నిక్కమగు స్వర్గము సజ్జన
గోష్ఠియే......కష్టము గడచిపోయిన పిమ్మట మనము వేదాం
తము చెప్పవచ్చును. కాని ముందుదృష్టిచే దానిని రాకుండఁ
జేయలేము. కడపటికి సుఖముగా జీవించుటకై మనకు బోధిం
పఁబడు విజ్ఞానమును భరించుటకు మన స్వల్పజీవితము అన
ర్హము. ఎటు తిరిగి మనబోధ నవలికి నెట్టివైచి ప్రకృతి విజృం
భించును.

నేను డిసెంబరు 2, 3 తేదులలో బెజవాడకుఁ బోవ
చ్చును. అంతయు అనుకొన్నట్లు జరుగునేని, నేను నెల్లూ
రిలో మకాముచేసి నామిత్రులతో నొక చిన్నగోష్ఠి సలిపి నా
కనులకును హృదయమునకును బండువు గావించికొనెదను...
ఇచ్చట పగళ్లు చలి తక్కువగా నున్నవి.

ఇంక నాజీవితశేషము కొలఁదికాలమే యని చింతయగు
చున్నది. ఏలయన ఇట్టి బుద్ధిశాలురగు ప్రియమిత్రుల సంగ
మము మదీయమువంటి యమాయక హృదయమునకు అతి
ప్రబలానుబంధము. ఈ యుత్తమనిధానమును గోల్పులుచు
మరణముకన్న నధికదురదృష్ట మెద్దియు లేదు.

ఇయ్యది నిన్ను నీ వారిని సంపూర్ణారోగ్యప్రశాంతు లలో నుండఁగాంచుఁ గాక యని యాశించు

విశ్వసనీయుఁడు,
వే. వేంకటరాయశాస్త్రి)
[22-11-27].

"ఎందఱు పండితప్రకాండులు, మహాకవులు, విమర్శకాగ్రేసరులు, ప్రసిద్ధప్రవక్తలు లేరు? శాస్త్రిగారియెడ వారి మిత్రశిష్య కోటికెల్లను ఇంతటి విపరీత భక్త్యభిమానము లేలొకో!" యని యాశ్చర్యపడువారలకుఁ బై లేఖలే సమాధాన మియ్యఁగలవు. ఆ యాకర్షణరహస్యము శాస్త్రులవారి హృదయములోనే యుండినది. వారు నిక్కముగ సహృదయులు, సరసులు. వారి హృదయము స్వచ్ఛము, మృదులము, ఆర్ద్రము, ప్రేమరస ప్రపూర్ణము, సహానుభూతికి ఆలవాలము. వేయేల, శాస్త్రులవారు సరస్వతీపుంభావమగుటయే గాక, మిత్రప్రేమయు శిష్యవాత్సల్యమును శాస్త్రులవారియందు మూర్తిభవించె నని చెప్పనొప్పును.

# XIII

## కొన్నికట్టిడి ఘట్టములు.

పలికినాఁడు గదా కాళిదాసుఁడు "ప్రాయః స్వం మహిమానం సంక్షోభాత్ ప్రతిపద్యతే జన్తుః" ("స్వప్రభావమెల్ల వాలాయముగఁ జూపుఁ బ్రాణికోటి క్షోభవడినయపుడు"), అని. ఒకని జీవితములో అతిక్లిష్ట ఘట్టములందుఁ గనుపట్టు వర్తనమే యాతని గుణశీలమునకు నికష మనఁదగును. అట్లే శాస్త్రులవారి జీవితములో నత్యంత విషమసమయములందు వారినడవడిఁ బరికింతుమేని శాస్త్రులవారి గుణమహిమ తేటతెల్లము కాఁగలదు. కావున ఈవ్యాసావళి నుపసంహరించుటకుఁ బూర్వము అట్టి ఘట్టములఁ గొన్నింటిని దడవెదను

అది శాస్త్రులవారి యేకైక పుత్త్రుఁడు మరణించిన మరుసటి యుదయము. అట్టిస్థితిలోనున్న శాస్త్రులవారిఁ దొలుసారి యెట్లు చూతునా యని విషణ్ణుఁడనై వారిగృహమున గుమిగూడిన బహుజనములో దొంగవోలె నొకమూల నొదిగి మూగవలె ముడిగియుంటిని. కాని యెప్పటివలెనే నిర్వికారులు గంభీరవదనులు నై కొలువుదీరియుండిన శాస్త్రులవారు తన చుట్టునున్న యొక్కొక్కరిని పేరుపెట్టి హెచ్చరించుకొని మా ప్రతివచనము నపేక్షింపక తామే జరిగిన యుదంతమెల్ల పూసగ్రుచ్చినపగిది నిట్లు వచించిరి! "ఏమండీ, మనరాజన్న

నిన్నటిదినము చనిపోయినాఁడు. చాలకాలము జబ్బుగా నుండినాఁడు. కాని యింతలో ఇట్లగునని మే మనుకొనలేదు. నేను యథాప్రకారము శిష్యులకుఁ బాఠము చెప్పుచుంటిని. రాజన్న యేదో యొకవిధముగా నున్నాఁడని మావారివలన విని చూచుటకుఁ బోయితిని. 'రాజన్నా' అని పిలిచి వానితల నాయొడిలోనికిఁ దీసికొంటిని వాఁడు కష్టముతో మొగమెత్తి యొకమారు నావైపుఁ జూచి కంటినిండ నీరువెట్టుకొని వెంటనే తల వ్రేలవేసెను. మాటచెప్పుటకు శక్తితప్పెను. అంతట కొలది నిమిషములలోనే ప్రాణముపోయెను. ఆమీఁద జరుగవలసిన యుత్తరక్రియలన్నియు ఒకజంత్రమువోలె నెఱవేర్చితిని. అందఱు ఆక్రందించుచున్నను నేను కంటఁ దడిమైనఁ బెట్టలేదు. కాని యాక్రియాకలాపము నిర్వర్తించి యింటికి మరలి వచ్చి నాగదిలో నొంటరిగఁ బ్రవేశించి తలుపుబిగించి బోరుమని వావిచ్చి యఱచి యంతవఱకు అణఁచియుంచిన దుఃఖమెల్ల నొక్కమారుగా వెలిఁ గ్రక్కికొంటిని. కాళిదాసుఁడు 'స్వజనస్య హి దుఃఖమగ్రతో వివృతద్వారమివోప జాయతే' (బందుగునియెదుట హృదయములోని దుఃఖము తలుపు తీసివైచినట్లు బయటఁబడును) అనినాఁడు. కాని నా విషయములో అది తద్విపరీతమైనది. స్వజనము పని విజనము చేసినది. ఏకాంతముగా లోనికేఁగి నాగది తలుపుమూయుట నాదుఃఖమునకు తలుపుతీయుట యైనది. ఈ దశలోనున్న నన్నుఁ జూచుటకు మీ రెంత పరితపించియుండుదురో నాకుఁ దెల్లియున్నది. కాని యేమిచేయుదము? ప్రారబ్ధ మనుభవింపక

లేఁడు గదా" అని. ఈలీలుననే ఆదినములలోఁ దనను బరామర్శించుటకు వచ్చినవారినెల్లఁ గూర్చుండఁబెట్టుకొని చెప్పుచుండిరి వచ్చినవారేమియుఁ బలుక నక్కఱలేకయే మౌనముద్రతో దమతమ సహానుభూతిని దెలుపుకొని వెడలు చుండిరి. శాస్త్రులవారి యీచరితమునే స్మరించి మదీయ "గురు స్మృతి" లో "ఏకపుత్రుఁ డకాలమృతి వాతఁ బడిన యత్తఱిని బాఠము చెప్పు ధైర్యమహిమ" యని రచించితిని.

మఱియొక క్లిష్టఘట్టము ఆంధ్రభాషాభిమానిసమాజము రూపడంగుట. ఆదుర్వార్త వజ్రాహతివోలె వీనులఁబడి నప్పుడు శాస్త్రులవారి సంతాపమునకు మేరయే లేకుండెను. నిజ సర్వస్వముఁ గోలుపోయిన విధమున శాస్త్రులవారు రోష విషాదదైన్యములు మోమున ముప్పిరిగొనఁగా నిట్లు పలికిరి. "అయ్యా, మారాజన్న చనిపోయినప్పుడును నన్ను ఇంత శోకము పైకొనలేదు. ఈసమాజమును నాకొమరునికన్న నెక్కువ గారాబముతోఁ బెంచుకొంటిని. దీని నిర్వహించుట యందు నేను బడినశ్రమ యటుండనిండు. దీనికొఱకై యెంత త్యాగమొనర్చితినో నాకే తెలియును. మదీయనాటకరచనా రంభమున నేను 'షేక్సుపియరు ముప్పదియాఱు నాటకములు వ్రాసెనందురు. మనము అన్నియేని వ్రాయలేమా?' అని యను కొంటిని. కాని సొంతనాటకములు మూఁడు వ్రాసి వానిని బాఠముచెప్పి యాడించుటతో నాజీవితము ముగియుచున్నది. ఇందులకుఁ గారణము ఈసమాజమే. ఇంకను నాటకమ్ములు

వ్రాయలేనైతినే యని నేను చింతింపలేదు. సమాజము పట్టినట్టు సంతసించుచుంటిని. అందుండి యెక్కిపెట్టిన దుఃఖజలధి గర్భమునఁ ద్రోయఁబడితిని" అని కంటికిఁ గడవెడు కన్నీరుఁ గార్చిరి. సమాజము పోవుటతో శాస్త్రులవారి యుల్లాసో త్సాహములు ముప్పాతిక పోయెను.

మఱియొకస్మరణీయఘట్టము మదరాసులో శాస్త్రుల వారు కంటికి శస్త్రచికిత్సఁ గావించుకొనిన సమయము చికిత్స యైనవెంటనే వైద్యుఁడు కంటికి కట్టుఁగట్టి కొన్నిదినములు కదలకుండవలెననియు, కంటితో నేమియుఁ బనిచేయకూడ దనియు గట్టికట్టడ యొనర్చెను. అట్టితఱి నేను శాస్త్రులవారిని జూచుటకుఁ బోయి నన్నుఁ దెలుపుకొంటిని. నారాకకు వారు మిగుల సంతసించి యిట్లు పలికిరి. "అయ్యా, మనశాస్త్రములో ఆత్మహత్య చేసికొనినవానికి అంధతామిస్ర నరకము అనుభవ మగునని విధించిరి గదా. ఈకంటిచికిత్స కాఁగానే యిప్పుడు నేను అట్టి స్థితిలో నున్నాను. ఏలయనఁగా 'ఐ' అను పదము నకు ఇంగ్లీషులో అక్షరభేదమాత్రమున 'కన్ను' 'ఆత్మ' ('eye' 'I') అనునర్థములు వచ్చును గదా. నిక్కముగా కన్నే ఆత్మ. అదిలేనివాఁడు ఆత్మహతుఁడే. కంటికి శస్త్రచికిత్స అనఁగా ఆత్మవధయే. ఇప్పుడు నేను కదలఁగూడదు. చదువఁ గూడదు. చూడఁగూడదు. ఇంతకన్న నరక మేమికావల యును! అచ్చట ఆంధ్రభారతము ప్రతి యుండును. దానిలో నాలుగుపద్యములు చదివి వినిపింతువా?" అని. అట్లే నేను

బలింపఁగా క్షుధాతురుఁడు మృష్టాన్నమును గ్రహించునట్లు శాస్త్రులవారు అమందానందకందళితవదనారవిందులై యాల కించి "ఆహా! యిప్పుడుగదా నాకు తిరిగి జీవము వచ్చు చున్నది! ఇప్పుడుగదా నేను అంధకూపము వెలువడి నందనో ద్యానమున విహార మొనర్చుచున్నాను!" అని నుడివిరి.

మఱియొక విషాదఘట్టము మాతృనిర్యాణము. శాస్త్రుల వారికి శతవృద్ధయగు తన తల్లిపై నపారప్రేమ. శాస్త్రులవారు కలకత్తాలో నుండినప్పుడు ఆమెకు చాల జబ్బుగానున్నదని తంతివార్త రాఁగా "నేను మరల మాయమ్మను జూడఁగలు గుదునా' అని మిగుల వాపోయెనఁట. వారు తిరిగి యిల్లు చేరి నంతనే యొనర్చిన మొదటిపని మాతృసందర్శనమే. అంత దిగులుపడి మరల ఆమెను జూచినప్పుడు వారికిఁ గలిగిన యానందమునకు మేరలేదు. శాస్త్రులవారు తనకు ఎచ్చట ఏమిసత్కారము లభించినను తత్క్షణమే దానిని దనతల్లికిఁ జూపికొని యామెదీవన వడయుచుండువారు. ఆమె చని పోయినప్పుడు శాస్త్రులవారు "My sole link with the golden past has snapped. Now I am an orphan. I feel for-lorn" ("నాకు గతదివ్యకాలముతో నుండిన యేకానుబంధము తెగిపోయినది. ఇప్పుడు నేను అనాథుఁడను, అశరణుఁడను") అని పలికి శిశువువలె విలపించిరి.

ఇఁక శోచ్యతమమైనఘట్టము శాస్త్రులవారికి జీవితావ సానసమయమునఁ గలిగిన ఋణబాధ. "ఋణగ్రస్తుఁడనై నే

చనిపోవుదునేమో? దానంజేసి నరకవాస మనుభవించి దానిఁ
దీర్చుటకు మరల జన్మమెత్తవలసియుండునేమో? ఏతన్ని
మిత్తము ఇహలోకముననే కారాగారము పాలగుదునేమో?"
అనుభీతి వారిని నిరంతరము వేధించుచుండెను. వారు ధర్మ
తత్పరు లగుటంజేసి తన కుటుంబమున కేమియు మిగులకపో
యినను అప్పుతీర్చిన దనిపించుకొనినఁ జాలుననెడివారు. ఋణ
విముక్తియే తనకు జీవన్ముక్తి యనెడివారు. ఒకనాడు శాస్త్రు
లవారీవిషయమే అతిదైన్యముతోఁ జెప్పుచుండఁగా వారికి
జ్యోతిషపారంగతులు శ్రీ ముక్తినూతలపాటి గోపాలకృష్ణ
య్యగారి యొద్దనుండి యొకలేఖ వచ్చెను. అందు శాస్త్రుల
వారి జాతకముఁబట్టి శాస్త్రులవారు సజీవులుగ నుండఁగానే
వారిఋణము నిశ్శేషము కావలయుననియు, అట్లగుట నిస్సం
శయమనియు వ్రాయఁబడియుండెను. దానిని వారు నాకుఁ
జూపి "దీనివలన నాకెంతయుఁ బ్రత్యాశ కలుగుచున్నది.
శాస్త్రము పొల్లగునా? నాయప్పు తప్పక తీఱఁగలదు" అని
యొకింత యూఱడిల్లిరి. శాస్త్రులవారిపై నత్యంత భక్త్యాదర
ములుగల యుదార మహాశయుల విరాళములచేత శాస్త్రుల
వారు ఋణవిముక్తులై వైజోస్యము ఫలించిన యుదంతము
పూర్వోక్తమైనది. శాస్త్రులవా రింకను బెక్కునాటకములు
రచింపఁదలపెట్టి తత్ప్రణాళికల వ్రాసియుంచుకొనిరి. వానినెల్ల
నాకుఁ జదివి వినిపించిరి. సమాజము విరాజిల్లుచుండి, శాస్త్రుల
వారికి ఋణభారము లేకుండినచో ఆనాటకములెల్ల "ప్రతాప

